## చందమామ

### ఈ సంచికలో యివి చదువుకోండి

| విషయము | పేజీ |
|---|---|
| ధన్యజీవి ... | 10 |
| సంక్రాంతి సంబరాలు ... | 12 |
| ప్రత్యుపకారం ... | 13 |
| అపూర్వ సాధం ... | 17 |
| తలవని తలంపు ... | 25 |
| గుడిగంటలు ... | 29 |
| బంగరు పాప ... | 33 |
| సాధురక్షణ ... | 39 |
| తథాస్తు బ్రాహ్మడు ... | 42 |
| వి బ్రాసికి పనెక్కువ ... | 44 |
| ఇంద్రజాలం ... | 50 |
| రంగుల బొమ్మకథ ... | 53 |
| తప్పనిసరి ... | 54 |

ఇవన్నీగాక పజిలు, పాటలు, ఇంకా, ఇంకా ఎన్నో వున్నై.

**చందమామ ఆఫీసు**
**పోస్టుబాక్సు నెంబరు 1686**
**మద్రాసు - 1.**




వినోదా వారి

# శాంతి

దర్శకత్వం
వేదాంతం రాఘవయ్య



పూర్ణా రిలీజ్

MATA

వినోదా పిక్చర్స్, 1, గోపాలకృష్ణ రోడ్డు, మదరాసు - 17
















తియ్యని పిప్పరమెంట్లు
MAP
వారివే


MAP

# చందమామ

సంచాలకుడు: చక్రపాణి





సంపుటి 10 : సంచిక 1

జనవరి 1952


లోగడ 'కల నిజమైంది' అనే కథ ప్రకటితమైనప్పుడు 'ఇది కట్టుకథ కదా, ఇటువంటి కథలవల్ల ప్రయోజన మున్నదా ?' అని ఒక అభిప్రాయం బయల్దేరింది. నిజానికి వాటి ఉపయోగ మున్నదనీ, ఆత్మవిశ్వాసంతో కృషి చేసిననాడు అసాధ్యమనేదే ఉండ బోదనీ చందమామ చరిత్రే రుజువు చేస్తున్నది. ఎలాఅంటే పైనచెప్పిన కథ లోని రాజుకుమల్లేనే నాలుగేళ్లనాడు చందమామ ఒక చిత్రమైన కల గన్నది—చల్లని పిల్లగాలులు వీచే మనోహర ప్రదేశంలో విశాల రమ్య మైనటువంటి పరమ సుందరమైనటు వంటి ఒక భవనం నిర్మించుకొన్నదట. అందులో తను విహరిస్తూ అందరకూ ఆనందాన్ని చేకూర్చిందట!—ఇదీ చందమామ కల. నిరుడీపాటికి ఇంకా ఏపొక తలంపు లేనేలేదు. ఏడాది నిండ కుండానే ఒక విశాలమైన ఆరామంలో ఆదర్శప్రాయమైనటువంటి అపూర్వ సౌధం నిర్మించుకుని, చందమామ అందులో ప్రవేశించిందంటే ఆనాటి కల నిజమైనట్టేకదా! కలలు ఫలించ టమే మానవునికి పండుగ. అందు లోనూ ఈ యేటి పెద్దపండుగ ఈ విధంగా మనకు ప్రత్యేకతను చేకూరు స్తున్నది. ఈ శుభ సందర్భంలో అందరకూ చందమామ జేజేలు !!!





# ధ న్య జీ వి

చీకటిరాత్రి, ఎడారి, ఊరుకా
ఇసుకబయలు చాలా దూరం.
యూసఫ్ నిదిరిస్తున్నా తెరచే
ఉంది గుడారపు ముఖద్వారం.

ఇంతలోన ఒక ఆర్తుడపరిచితు
డతనిని శరణని లేపాడు.
గడగడ మిగులవడకి, నోరాడక
అతడు తన భయం చూపాడు.

'రాజదండనకు వెరచి ఎలాగో
అలాతప్పుకొని వచ్చాను.
దయగలవారని మీప్రశంసవిని
నేటికిశరణం జొచ్చాను.'

అనగా విని యూసఫ్ అపుడతనిని
బుజ్జిగించి ఓదార్చాడు.
అభయమిచ్చి వెరువకుమని దయగా
సకల సపర్యలొనర్చాడు.

తెల్లవారకడనే అతడతిథిని
లేపి చాల ధనమిచ్చాడు.
దూరంగా తప్పించుక పొమ్మని
తనగుర్రం చూపించాడు.

రచన :

బైరాగి

వెలుగు వెలుగుతో వెలిగినటులనే
ఒక మనుజుని హృదయౌదార్యం
వెలుగుతుంది మరిఒకని మనసులో
తెలివెలుగై; ఇది అనివార్యం.

ఆత్మవిజయగతమహితకాంతితో
అపరిచితుని మొగమలరింది
యూసఫ్‌ప్రేమోల మోకరిల్లాడత
డక్షులలో నీ రొలికింది.

"దేవా! నీకొడుకును మడియించిన
హంతకు డిబ్రహింను నేనే."
అని పశ్చాత్తాపా ర్తచిత్తుడై
అపరిచితుడు వడియనగానే—

'అబ్బాయీ, అట్లైతే లే, మరి
మూడురెట్ల ధనమిదిగై కొని
వెళ్లు, వెళ్ళు దూరంగా మళ్ళా
తిరిగిరాకు ఇటు ఎప్పటికిని.'

అని యూసఫ్ పగసెగలు చంపుకొని
అతని నెచటికో అంపాడు.
ధన్యుడు జగతిని తన అపకారికి
ఉపకారం చేసేవాడు.





# సంక్రాంతి సంబరాలు

"మహేశ్వర్" (మద్రాసు)



సంక్రాంతిలక్ష్మి రావమ్మా
సంతోషలక్ష్మి రావమ్మా!

సిరిసంపదలను ఇస్తావా
శుభకాంక్షల దీవిస్తావా?

పసుపురాసినా గుమ్మాలూ
తోరణాల దర్వాజాలూ
దాటుకరమ్మా మా అమ్మా
సంక్రాంతిలక్ష్మి జేజేలూ
సంతోషలక్ష్మి జేజేలూ!

బంతిపూల, చామంతిపూల
మందారపూల అందాలమాల
మా గంగిరెద్దు మెడనూగే,
ఈ వేడుకచూడగ రావమ్మా
సంక్రాంతిలక్ష్మి రావమ్మా!

తలంటుకున్నా పాపలతో
చిలకపలుకు లాడుతునూ
ఇంటింటనున్న శోభలనూ
మురిసిచూసి రావమ్మా
అమ్మా సంక్రాంతిలక్ష్మి!

కోడిపుంజు పందాలూ
గొర్రిపోతు ఢీడిక్కులు
జబ్ జనకడి—బబ్ జనకడి
ఝుంజనకడి పులివేషం
మరువలేని సంబరాలు
మురిసిచూసి రావమ్మా
అమ్మా సంక్రాంతిలక్ష్మి!

పొల్లులేక కొల్లలుగా
కోసిన వరిపంటలనూ
కొనితెచ్చే ధాన్యలక్ష్మి
రావమ్మా సంక్రాంతిలక్ష్మి!




# ప్రత్యుపకారం

వింధ్యారణ్యానికి సమీపంలో ఒక పల్లె వుంది. ఆ పల్లెలో ఒక పాములవాడు ఉండే వాడు. వాడొకనాడు అడవికి వెళ్లి, ఒక పుట్టఎదట నిలబడి, నాగస్వరంబుర్రతో ఊదేసరికి, ఆ పాట విని పుట్టలోనించి నాగు పామొకటి చక్కా వచ్చింది. ఆ పాము పడగవిప్పి ఆడుతూ వాడిపాట వినటంలో మైమరచివుండగా చూసి, వాడు దాన్ని పట్టేసి తన బుట్టలో పెట్టేసుకున్నాడు.

ఆ పాము తనకుజరిగిన మోసానికి దిగులుజెంది, ఆ ఆపదలోంచి తప్పించు కోవడం ఎలాగా అని ఆలోచిస్తూండగా, దయామయుడనే సామంతరాజు ఎదురై, 'ఏమిట్రా అబ్బీ, బుట్టలోది?' అని వానిని అడిగాడు.

'ప్రభూ, గొప్పజాతి త్రాచుపామును పట్టేను చూస్తారా!' అంటూ పాములవాడు దానిని చూపించాడు.

ఆ అదును చూచుకొని పాము సామంతరాజుతో, 'రాజా! - అడవిలో నేను స్వేచ్ఛగా తిరక్కుండా ఈ కిరాతుడు నన్ను మోసంచేసి, చెఱపట్టి తీసుకు పోతున్నాడు. నన్ను వీనిబారినుండి తప్పించి స్వేచ్ఛను ప్రసాదించుప్రభూ!' అని మొర పెట్టుకుంది.

దయామయుడు జాలిగుండె కలవాడు. పాములవాడితో, 'అబ్బీ, పాముని వదిలే సెయ్యి. దానిదారిన అదిపోతుంది' అని చెప్పాడు.

కాని పాములవాడు, 'ప్రభూ, ఈపామును ఊళ్లమ్మట తీసుకెళ్లి ఇంటింటాతిప్పి, ముష్టి ఎత్తుకుంటేగాని నాకూ నా సంసారానికీ గడవదు. దీన్ని వదిలెయ్యమని ఆజ్ఞాపించి, నా కడుపుమీద కొడతావా స్వామీ?' అన్నాడు.

అందుకు దయామయుడు, 'అదే కారణ మైతే, ఈ ముత్యాలహారం తీసుకుపోయి

బి. జ్ఞానాంబ, నిడుదవోలు



అమ్ముకో. దీనితో నీ దరిద్రం తీరుతుంది. పామునిమాత్రం వదిలెయ్యి' అని అంటూ, మెడలో హారాన్ని తీసి వాడిచేతిలో పడేశాడు.

పాములవాడు సంతోషించి, పామును వదిలేసి, తనదారిని పోయాడు.

పాము తన పడగను వంచి దయామయుడికి నమస్కారంచేసి, 'రాజా, నీవు నాకు ఈనాడు చేసిన మేలు ఎన్నడూ మరువను' అని కృతజ్ఞత తెలిపి మాయమైంది. దయామయుడు వెళ్లి తనకోట చేరుకున్నాడు.

* * *

కొంతకాలం గడిచిపోయింది. దయామయుడంటే కిట్టని సామంతులు కొందరు చక్రవర్తితో అతనిమీద చాడీలుచెప్పి ద్వేషం పుట్టించారు. దయామయుడు తరుచూ వింధ్యారణ్యంలోకి వెళ్లి, అక్కడి భిల్లులతో కుట్రచేస్తున్నాడనీ, వాళ్ళందర్నీ లేవదీసి చక్రవర్తిపైన యుద్ధానికి రాబోతాడనీ లేనిపోనివి కల్పించి చెప్పేసరికి చక్రవర్తికి, నిజమే ననిపించింది.

ఆయన దయామయుణ్ణి ఏదో మిషపైన రప్పించి, అతడు ఒంటరిగా వుండగా బంధించి ఖైదులో వేయించాడు.

"అయ్యో, నేనేం నేరం చేశానని నాకీ శిక్ష విధించారు!" అని దయామయుడు తనలో తను దిగులుపడుతూ రోజులు వెళ్లబుచ్చుతూవున్నాడు. ఒకనాటి అర్ధరాత్రివేళ యెదురుగా యేదో మెదులుతున్నట్టు కనపడింది. నిదానించి చూసేసరికి అదొక సర్పం.

అది పడగఎత్తి దయామయునితో 'రాజా, నన్ను మరిచిపోయావా? అనాడు అడవిలో కిరాతుని బారినుండి నీవు రక్షించిన సర్పాన్నే నేను' అంది.

'ఓహో నువ్వా? ఎందుకొచ్చా విక్కడికి? కాపలావాళ్లు చూస్తే నిన్ను చంపేస్తారే. వెళ్ళిపో' అన్నాడు రాజు.





'పరవాలేదు రాజా. నన్ను అనాడు నువ్వు ఆ చెఱనుండి విడిపించావు. ఈనాడు నిన్ను ఈ చెఱనుండి విడిపించటానికే యిప్పుడు వచ్చాను' అంది నాగు.

దయామయుడు, 'వెఱ్ఱిదానా, నన్ను నువ్వు విడిపించలేవు! ఏమంటే కిట్టనివాళ్లు నాకు ప్రతికూలంగా చక్రవర్తి చెవిలో పోసిన విషం చాలా చెడ్డది! ఆ విషానికీ నీ కోరలలో విషానికీ పోలికే లేదు' అన్నాడు.

అందుకు నాగు 'రాజా, నువ్వు చెప్పిన మాట నిజమేగాని, నిన్నుమాత్రం నేను రక్షించగలను. ఉపాయంచేత ఏమైనా సాధించవచ్చు. నిన్ను చెఱనుంచి తప్పించటానికి నేను వుపాయం ఆలోచించుకునే వచ్చాను' అంది.

'ఏమిటది?' అని అడిగాడు దయామయుడు.

"తెల్లవారేలోగా నేను చక్రవర్తి అంతఃపురం చేరుకుని, నిద్రలోంచి లేచేసరికి ఆయన కంఠాన్ని చుట్టుకుని వుంటాను. నన్ను చంపుదామని కర్రలూ, కత్తులూ పుచ్చుకొని అందరూ వస్తారు కాని నేను చక్రవర్తి కంఠాన్ని చుట్టుకుని వుండటంచేత నన్నుకొడితే నా ప్రాణంతోబాటు చక్రవర్తి ప్రాణంకూడా పోతుంది గనక నా వంటి మీద దెబ్బ వెయ్యటానికి యెవరూ సాహసించరు. 'చక్రవర్తికి అపాయం కలగకుండా, పామునుండి ఆయనను రక్షించే మంత్రగాళ్లెవరూ లేరా?' అని వాళ్ళు వెతకటం మొదలెడతారు. అప్పుడు నువ్వు, 'సర్పాన్ని మంత్రంచేత వశంచేసుకుని చక్రవర్తిని రక్షించగలను. నేను అడవులు తిరిగేవాణ్ణి. నాకీ మంత్రాలు వచ్చు' నని చెప్పు. అప్పుడు నీ అజ్ఞానుసారం నేను వర్తిస్తాను" అని పాము తన ఉపాయాన్ని అతడికి తెలియచేసి మాయమైంది. ఆ ప్రకారమే చేశాడు దయామయుడు.

సూర్యోదయమయేసరికి చక్రవర్తి అంతఃపురంలోంచి హాహాకారాలు వినపడ్డాయి. దయామయుడు పహరావాళ్ళని 'ఏమిటి?' అని ఏమీ ఎరగనట్లు అడిగి తెలుసుకొని, 'ఈ ఆపదనుంచి చక్రవర్తిని నేను తప్పించగలను' అన్నాడు.

ఆ సంగతి అంతఃపురానికి ఒక క్షణంలో తెలిసి అక్కడివాళ్లంతా చెఱసాలకు పరుగెత్తుకుంటూవచ్చి దయామయుణ్ణి బుజాల మీద ఎక్కించుకుని, హుటాహుటీని చక్రవర్తి సమక్షానికి తీసుకుపోయారు.

చక్రవర్తి గజగజ వణుకుతో 'దయామయా! నిన్ను ఖైదులో వేశానని కోపం కొద్దీ ఉపేక్షించక, ఈ క్రూరసర్పంనుండి నన్ను రక్షించు!' అని ప్రాధేయపడ్డాడు.

పడగనెత్తి దగ్గరికి ఎవ్వరినీ చేరనీకుండా బుసలుకొడుతూన్న సర్పరాజును చూచి, దయామయుడు, 'నాగరాజాయ నమః' అని, చుట్టూ చూస్తూన్న జనంతో, 'అయ్యలారా, ఈ సర్పరాజును పంపేస్తాను. వెడుతూన్నప్పుడు ఈతనికి ఎట్టిహానీ తలపెట్టరాదుసుమా!' అన్నాడు.

వాళ్ళు తమ కర్రలూ, కత్తులూ దూరంగా పారేసి చక్కావచ్చారు. అప్పుడు దయామయుడు, పాముకేసి తిరిగి, 'హ్రాం, హ్రీం, హ్రూం, ఫట్, స్వాహా' అని ఒక చిటిక వేసి, 'భుజంగోత్తమా! వింధ్యారణ్యంలో పెద్దమఱ్ఱికింద నీపుట్ట ఉంది. తిన్నగా వెళ్ళిపో!' అన్నాడు.

ఆ ఆజ్ఞకోసమే ఎదురుచూస్తూన్న నాగు చక్రవర్తిమెడనుండి మెల్లిగా చుట్టవిప్పుకొని అందరూ చూస్తోండగానే మాయమయింది.

చక్రవర్తి దయామయునికి పాదాక్రాంతుడై ప్రాణభిక్ష పెట్టినందుకు కృతజ్ఞత తెలిపాడు. తన అపరాధానికి క్షమార్పణ చెప్పుకొని, ఎన్నో కానుకలూ, బహుమానాలూ ఇచ్చి గౌరవించి, అతని రాజ్యానికి అతణ్ణి పంపించివేశాడు.






అది ఒక మారుమూల దేశం. ఆ దేశంలో ప్రజలైతే వున్నారుకాని, పాలించే రాజు లేడు. రాజులేని ఆ దేశంలో ప్రజలు ఎవళ్ల యిష్టానుసారం వాళ్ళు ప్రవర్తిస్తూ వచ్చారు. ఇలా నాథుడు లేకపోవడంవల్ల ఆ రాజ్యానికి 'అనాథ రాజ్యం' అని పేరు వచ్చింది.

కాలక్రమాన ఆ దేశానికి రాజులు వచ్చారు, పరిపాలనా చేశారు, ప్రజలను ఒక కట్టుబాటులో వుంచి, వారికి సౌఖ్యమూ చేకూర్చారు. ఇన్ని మార్పులు వచ్చినా, ఆ దేశానికి అనాదిగా వుంటున్న అనాథ రాజ్యమనే పేరుమాత్రం అలానే నిలిచి పోయింది.

అటువంటి అనాథరాజ్యాన్ని ఏలిన రాజుల్లో కృపాసింహుడు ఒకడు. కృపా సింహుడు తనహయాములో ప్రజల క్షేమం కోరి ఎన్నోమార్పులు చేశాడు. కాని, అది నుండివస్తున్న కొన్ని విడ్డూరపు ఆచారాలను మాత్రం సరిదిద్దలేకపోయాడు. అటువంటి విడ్డూరపు ఆచారాలలో 'నామకరణ మహోత్సవం' ఒకటి.

అనాథరాజ్యంలో, రాజవంశంలో జన్మిం చిన ఎవ్వరికీ మనకుమోస్తరుగా పేరు పెట్టుకోటానికి స్వతంత్రత లేదు. ఒక శిశువు జన్మించిందీ అంటే పుట్టిన రోజునే నామకరణ మహోత్సవం జరిపించాలి. ఆ మహోత్సవానికి చుట్టుపక్కలవుండే రాజులందరూ వస్తారు. వారంతా ఒక్కొక్కరు ఒక్కొక్క పేరు సూచిస్తారు. ఆ పేర్లన్నీ ఒక గ్రంథంలో లిఖించి, దానిని భద్రపరుస్తారు. పదహారేళ్ళు వచ్చేవరకూ ఆ బిడ్డను 'రాకుమారుడు' అనిమాత్రమే



పిలుస్తూ, పదహారవయేడు రాగానే ఆ పేర్లను రాకుమారుడికి చూపించి తనకు నచ్చినపేరు ఎంచుకోమంటారు. అలా రాజకుమారుడు ఎంచుకొని ప్రజలకు తెలియజేస్తే ఆపేరే నాటినించీ అమలులోకి వస్తుంది.

కృపాసింహుని పరిపాలన అన్నివిధాలా బాగానే వున్నది. కాని, ఏభైఏళ్ళు పైబడినప్పటికీ సంతతి లేకపోవడం అతనికీ, రాజ్యంలోని ప్రజలకూ కూడా తీరని విచారకారణమయింది. 'మన ప్రభువుకు వేలెడంత నిసుగు లేకపోయెకదా!' అని ప్రజలందరూ చింతించేవారు. కాని, రాజ్యంలోకల్లా ఇందుకు సంతోషించినవాడు ఒకే ఒక్కవ్యక్తి వున్నాడు. అతడే రాణీగారి తమ్ముడు శక్తిసింహుడు.

రాజూ, రాణీ సంతతికోసమని తపించిపోతూవుండగా, శక్తిసింహుడు మాత్రం వారికి సంతతి కలగకూడదని ముక్కోటి దేవతలకూ మొక్కుతూ వుండేవాడు. తన బావమరది యిక ఎంతకాలం జీవించబోతాడు? అతని తదనంతరం అక్కగారు తననేకదా గద్దెమీద కూర్చోపెడుతుంది! అని అతడు ఉవ్విళ్ళూరుతుండేవాడు. ఐతే, తానొకటి తలిస్తే దైవమొకటి తలిచినట్టయింది.

కృపాసింహుడి తపస్సిద్ధి ఫలించి రాణి దేవప్రియ గర్భం ధరించింది. ఇది తెలియగానే శక్తిసింహుడికి గుండెల్లో రాయిపడింది. రాజ్యంలో ప్రజలందరూ శుభవార్త ఎప్పుడు వింటామా అని కనిపెట్టుకుని వున్నారు. శక్తిసింహుడు మాత్రం లోలోపల కుళ్లి కుసినారిపోతున్నాడు. తను కట్టుకున్న గాలి మేడలన్నీ కూలిపోయినవే! ఇప్పుడు గత్యంతరం ఏమిటి? అని దీర్ఘాలోచనలో పడ్డాడు.

ఇక రేపో మాపో పురుడు వస్తుందనగా అతడు ఒకనాటిరాత్రి అంతఃపుర దాదిని

రహస్యంగా పిలిచి "నాకు నీవల్ల కాదగిన గొప్ప సహాయం ఒకటున్నది. నేడో రేపో మా అక్క బిడ్డను కంటుంది. అది ఆడశిశువు అయితే ఏబాధా లేదు. మగశిశువు అయిన పక్షంలో సమయంచూచి, పిట్టకైనా తెలియకుండా ఈ మందును బిడ్డకు పట్టాలి" అంటూ ఒక పొట్లం చేతికిచ్చాడు. తనకు రాజ్యం వస్తుందనీ, తను గద్దె ఎక్కిన తర్వాత కోరుకొన్న బహుమతులన్నీ ఇస్తానని ఆ దాదికి అనేకవిధాల ఆశపెట్టాడు.

ప్రజల అదృష్టం పండి కృపాసింహునికి కొడుకే పుట్టాడు. నామకరణ మహోత్సవానికి అతివైభవంగా ఏర్పాట్లు జరిగినై. పట్టణమంతా కలకల్లాడుతూ వున్నది. ఇరుగు పొరుగు రాజులందరూ వచ్చేశారు. దర్బారు కిటకిటలాడుతూ వున్నది. ఈ మహోత్సవం దిగ్విజయంగా జరిపే బాధ్యతఅంతా శక్తిసింహుడికే వప్పజెప్పాడు రాజు. శక్తిసింహుడు తన అయిష్టతను ఎంతమాత్రమూ పైకి తెలియనీయలేదు.

పురుడు రావటంతోనే ఆస్థానవైద్యుడు రాణినాడి పరీక్షించాడు. అంతా సవ్యంగానే వున్నదన్నాడు. బాలెంతకు అవసరమయిన మందులు ఇచ్చి, దర్బారులోని మహోత్స






బిడ్డడికిద్దామా అని దాది కనిపెట్టుకుని వుంది. ఆమె అలా కన్నుమూసిందో లేదో రొండినున్న మందుపొట్లం తీయబోయింది. ఇంతలో రాజుపంపిన పరిచారికవచ్చి గది వాకిట నిలబడి, "అమ్మా! అంతా తమ రాకకు ఎదురుచూస్తున్నారు" అని చెప్పింది.

దాది వులిక్కిపడింది. రొండినున్న పొట్లం తియ్యలేదు. రాణిని మేల్కొల్పి, "అమ్మా! మహారాజావారు కబురంపారు. ముస్తాబుఅయి త్వరగా వెళ్లాలి" అని తొందరపెట్టింది.

వానికి తనుకూడా పోయాడు. అక్కడ రాజు అతిథులందరకూ స్వయంగా ఆహ్వానమిస్తున్నాడు.

రావలసిన వారందరూ వచ్చేశారు. బిడ్డడి పేరు లిఖించటానికని దర్బారులో గ్రంథం తయారుగా వున్నది. మహోత్సవానికి వచ్చిన ఇరుగు పొరుగు రాజులందరూ వారువారు కూర్చుకొని వచ్చిన పేర్లను ఎప్పుడు గ్రంథంలో లిఖిద్దామా అని ఆత్రంతో వున్నారు. అన్నీ అమరిపోయినై. ఇక రాణీ రావటమే తరువాయి.

అక్కడ అంతఃపురంలో రాణీకి ఎప్పుడు కునుకు పట్టుతుందా, ఎప్పుడు మందుకలిపి

రాణీలేచింది. ముస్తాబు చేసుకొంటోంది. ఈ అదనుచూచి, దాది మందుని బిడ్డకిచ్చే పాలల్లోకలిపివేసింది. తొట్టిలోవున్న బిడ్డడిని తీసుకుంది. తీరా పాలు పట్టబోయేటంతలో మళ్ళీ కబురువచ్చింది, అందరూ కనిపెట్టుకొని వున్నారని.

ఈ కబురు వినగానే రాణి "ఓసీ, దాదీ! నువ్వు బిడ్డణ్ణి ఎత్తుకుని ముందుగా సాగుతూ వుండు. వెనకాతలే వచ్చేస్తున్నానని రాజావారితో మనవిచెయ్యి" అన్నది.

దాది మారుమాట చెప్పలేకపోయింది. బిడ్డడినెత్తుకొని దర్బారుకు బయలుదేరింది. ముందు దాసదాసీజనం బారులుతీర్చి

నడుస్తున్నారు. దాది ఒకచేత్తో బిడ్డనెత్తుకుని ముందు నడుస్తున్న పరిజనాన్ని రెండోచేత్తో సర్దుతూ వారివెనుక వెళుతున్నది. దర్బారును సమీపించారు. దర్బారువాకిట శక్తిసింహుడు నిలబడివున్నాడు. తను చెప్పిన పని పూర్తిచేసి, బిడ్డడు చనిపోయాడనే కబురు తెస్తుందికదా అని ఎదురు చూస్తున్నాడు. అందుకు బదులుగా యిప్పుడు బిడ్డడిని ఎత్తుకొని దాది రావటం కనబడేసరికి, అతడు ఉగ్రుడై పోయాడు. నిలబడిన చోటునుండి కదలకుండానే దాది వైపు తీవ్రంగా చూచాడు.

దాది బిత్తరబోయింది. బిడ్డ జారి కింద పడి కెవ్వుమన్నది. అయితే మేళతాళాలతో మారుమ్రోగుతున్న ఆ సమయంలో బిడ్డడి ఏడుపు ఎవరికి వినబడుతుంది?

దాదికి ఒళ్ళు కంపించిపోయింది. గభీమని బిడ్డను లేవదీసి మామూలుగా ఎత్తుకున్నది. అందరూ దర్బారు మందిరము చేరుకున్నారు. రాణిగారు వెనకాతలే వస్తానన్నారని దాది రాజుకి చెప్పింది.

ఇది విన్న రాజు ఆశ్చర్యపోయాడు. "కబురుమీద కబురువెళ్ళినా రాణీరాలేదు సరికదా, బిడ్డడిని ఒంటరిగాకూడా పంపిందే.





ఒకవేళ స్వస్థతగా లేదేమో! తమరొక్క పర్యాయంవెళ్ళి రాణివారిని చూచిరండి" అని అస్థానవైద్యుడిని పంపాడు.

అస్థానవైద్యుడు వెళ్లి రాణీని దర్శించి తను వచ్చినపని మనవిచేసుకొన్నాడు.

రాణీ చిరునవ్వునవ్వి, "మరేమీలేదు. కొంచెం నీరసంగావున్నది. అందువల్ల బిడ్డని ముందుగా పంపాను. మీకు అనవసరంగా శ్రమకల్పించాను" అని నొచ్చుకొన్నది.

"ఎంతమాట! ఎంతమాట!! ప్రభువుల సేవకంటే మాకుకావలసింది ఏమిటుంది? తమరు ఈమందు పుచ్చుకోండి. నీరసం తగ్గిపోయి కులాసాగా వుంటారు" అంటూ అస్థానవైద్యుడు, ఏదో మందుతీసి రాణీకి అందించాడు.

రాణీ అందుకొంటూ "ఇక తమరు వెళ్ళండి. క్షణంలో నేనూవచ్చి చేరుకుంటున్నానని నామాటగా మహారాజా వారికి మనవిచేయండి" అన్నది.

అస్థానవైద్యుడు తిరిగివచ్చి, "మరేమీ లేదు మహారాజా! పచ్చిబాలెంత కనుక కొంచెం నీరసంగా వున్నారు. అది తగ్గటానికి ఔషధంయిచ్చి వచ్చాను. మరొక్క క్షణంలో వారూ చేరుకోగలరు" అని మనవి చేసుకున్నాడు. రాజు స్థిమితపడ్డాడు.

శుభ ముహూర్తం ఇంకొక్క అరగంట మాత్రమే వున్నది. అయినా, రాణి రావడం కనపడలేదు. అందుచేత 'నీవేపోయి దగ్గరుండి రాణిని తీసుకురా' అనిచెప్పి రాజు దాదిని మళ్ళీ పంపించాడు. బిడ్డనెత్తుకునే దాది మళ్ళీ అంతఃపురానికి వెళ్ళింది.

రాణిగారి శయ్యాగృహం సమీపించబోయేసరికి, లోపలినుంచి ఒక వృద్ధురాలు బయటికివచ్చింది. ఈమె ఎవరికీ తెలియని కొత్తవ్యక్తి. ఆమె దాదివేపు మిర్రిచూచి,— "బిడ్డను మళ్ళీ పడవేసేవ్, జాగ్రత్త!!" అని హెచ్చరించింది.



ఈమాటకు దాది ఉలిక్కిపడి,—"ఎవరవు నీవు? అంతఃపురంలోకి నిన్ను ఎవరు రానిచ్చారు? నాసంగతి నీకెలా తెలిసింది? నన్ను అజ్ఞాపించటానికి నువ్వు ఎవరవు? ఫోఫో నీదారిని. ఎలా వచ్చావో అలా వెళ్లిపో" అని బూకరించింది.

వృద్ధురాలు చలించలేదు. నిలకడగా అలానే నించుని,—"వెళతాలే. నీకు ఒక మాట చెప్పిపోవటానికని వచ్చాను. జాగ్రత్తగా విను. ఇప్పుడు రాజ్యంలో అమలు జరుగుతున్నది మూఢాచారం. ఎవరెవరో వచ్చి పేర్లు రాయడం ఏమిటి? ఆ పేర్లన్నీ పదహారేళ్లవరకూ దాచివుంచడ మేమిటి? అందులోనించి ఒకపేరు ఎంచుకోవడ మేమిటి? ఎవరికితోచినపేరు వారు ముచ్చటగా పెట్టుకొనటానికి స్వతంత్రత లేకపోవడ మేమిటి? ఈ దురాచారం ఇంతటితో అంతరించాలి. ఇప్పుడు పుట్టినబిడ్డకు మహారాణీ జ్ఞాపకార్థం 'దేవసింహుడు' అని పేరు పెట్టమన్నానని మీ రాజుతో చెప్పు. తలిదండ్రుల పేరు నిలబెట్టడమే వంశానికి మర్యాద!" అని చెప్పింది.

దాది ఆవేశంతో "ఓసీ, శకునపక్షీ! ఎక్కడ దాపరించావే? తలిదండ్రులు జీవించివుండగా ఆపేరు శిశువుకు పెట్టవచ్చునా? ఎటువంటి ఓటిమాట వచ్చింది నీ నోటివెంట? పైగా, తరతరాలుగా వస్తున్న ఆచారాన్ని ఉల్లంఘించమంటావా? ఏమిటీ పిచ్చికూతలు? ఏమిటీ అపశకునపు పలుకులు? ఉండు నీభరతం పట్టిస్తా. ఏమనుకున్నావే! రాజుగారితో చెప్పివస్తా ఉండు" అంటూ దర్బారుకు పోబోయింది.

పోబోతున్న దాదిని వృద్ధురాలు వెనక్కు లాగి, "తొందరపడకు. నీవు రాజుతో చెప్పవలసినవార్త వున్నదిలే. చెప్పి వద్దువుగానిలే" అంటూ అదృశ్యరూపం పొంది కిటికీగుండా ఎగిరిపోయింది.

దాది, ఆవేశంతో ఉరకలేసుకుంటూ బిడ్డ నెత్తుకుని దర్బారుకు పరుగెత్తింది.

అక్కడ దర్బారులో 'రాణీగారు ఇంకా రాలేదేమిటి? ఇంకా రాలేదేమిటి?' అని అందరూ ఎదురుచూస్తూ వున్నారు. ఇంతలో దాది ప్రవేశించింది. దాది కంగారుతో వుండటం చూచి, రాజు కంగారుపడ్డాడు. రాజు కంగారుపడటం చూచి, మంత్రులూ, మహోత్సవానికి వచ్చిన రాజులూ లక్షల కొద్దీ ప్రజా సందిగ్ధంలో పడ్డారు.

దర్బారు దర్బారంతా కారణం తెలియకుండానే అట్టుడికినట్టు ఉడికిపోతున్న సమయంలో కోటలో గంటలు వినిపించినై. అయ్యో! అవి మామూలుగంటలు కావు. మరణగంటలు!!!—అందరూ నిశ్చేష్టులయ్యారు. శరీరాలు కంపించిపోతున్నయి. వంటిమీద చైతన్యం లేకుండానే ఒక్కొక్కళ్ళు గంటలు లెక్కెస్తున్నారు.

అనాథరాజ్యంలో ఇదిపక ఆచారం: రాజకుటుంబంలో ఎవరైనా చనిపోతే, ఆ చనిపోయిన వ్యక్తికి ఎన్ని ఏళ్ళున్నాయో అన్ని గంటలు కొడతారు. ఇప్పుడు ఎవరు మరణించారో గంటలు పూర్తిఅయ్యేవరకూ ఎవళ్లకూ తెలియదాయె. భయంతో భీతాహంతో హడిలిపోతూ, ఒక్కొక్కళ్లూ ఒకటీ ...రెండూ...మూడూ...అంటూ గంటలు లెక్కెస్తున్నారు.

అలా వరసని ముప్పైతొమ్మిది గంటలు కొట్టి ఆగింది. ముప్పైతొమ్మిది ఏళ్ళు రాజకుటుంబంలో ఎవరికి వున్నాయా అని ప్రజలు గుసగుసలాడజొచ్చారు. ఎక్కడి జనం అక్కడనే చెల్లాచెదరై, వర్తమానం తెలుసుకోవాలనే తహతహతో కోటవేపు పరుగులెత్తసాగారు. ఇక నిప్పుడు దర్బారులోనేకాదు, కోటలోకూడా సంతోషమంతా కల్లోలంగా మారిపోయింది! (ఇంకావుంది)






చెన్నపట్టణంలో పెద్ద ఫ్యాక్టరీ ఒకటివుంది. ఆ ఫ్యాక్టరీలో రోజూ కొన్నివందలమంది పనివాళ్ళు పనిచేస్తూవుంటారు. ఫ్యాక్టరీ యజమాని పనివాళ్లకి ఏరోజు జీతం ఆరోజు కాకుండా వారాని కొకమాటు ఇవ్వటానికి ఏర్పాటుచేశాడు. వారం ఆఖరున ఆయన జీతాలక్రింద బట్వాడా చెయ్యవలసిన సొమ్ము ఏడువేల రూపాయల పైచిల్లర అయేది. యజమాని ప్రతి శనివారం పదిగంటలకి ఈ మొత్తానికి చెక్కురాసి 'కదిరివేలు' అనే గుమాస్తాకి ఆ చెక్కుయిచ్చి, దానిని మార్చి సొమ్ము తేవటానికని బ్యాంకుకు పంపేవాడు. కదిరివేలు గట్టి తోలుసంచీ ఒకటి సైకిలుకు తగిలించుకుని వెళ్లి, చెక్కు మార్చి నోట్లన్నీ అందులోపెట్టుకుని భద్రంగా తెచ్చి యజమానికి పప్పగించేవాడు.

కదిరివేలు ఆ ఫ్యాక్టరీలో గుమాస్తాగా చేరి పదేళ్లకుపైన అయింది. అతడంటే యజమానికి మంచినమ్మకం కుదిరింది. అతని కిప్పుడు యెనభైరూపాయలు జీతం.

ఒక శనివారం మామూలుప్రకారం కదిరివేలు చెక్కుమార్చి డబ్బు తెస్తోంటే అతని బుర్రలోకి ఒక విచిత్రమైన ఆలోచన దూరింది. ఆ ఆలోచనకి కారణం ఆ క్రిందటి రాత్రి అతను పత్రికలో చదివిన విషయమే. కలకత్తాలో తనకుమల్లేనే బ్యాంకులోంచి డబ్బుతెస్తూవున్న ఒక అసామీని దారిలో ఇద్దరు మనుషులు అడ్డగించి రూపాయలసంచీ లాక్కుపోయారనీ, వాడు ఇవ్వక పెనగులాడితే వాణ్ణి తుపాకీపేల్చి చంపేసి సొమ్ము పట్టుకు పారిపోయారనీ ఒక వింతవార్త చదివేడు.

'నన్నుకూడా ఇలాగే దారిలో ఎవళ్ళో అటకాయించి, దోచుకున్నారని నేను గోల పెడితే ఏమవుతుంది? అంతా నమ్ముతారు. ఏమంటే ఇలాంటి దోపిడీలు ఇప్పుడు చాలా

పి. సూర్యనారాయణ, మాంబళం.



చోట్ల జరుగుతున్నాయి. నేనంటే అందరికీ, అందులోనూ ముఖ్యంగా మా యజమానికీ, ఎంతో నమ్మకం' అని వాడికి బుద్ధి పుట్టింది.

ఈ బుద్ధి పుట్టినప్పట్నుంచీ కదిరివేలుకు మరో ఆలోచనే లేకపోయింది. పై శనివారం వచ్చింది. చెక్కు మామూలు ప్రకారం చేతికి వచ్చింది. బ్యాంకుకీ ఫ్యాక్టరీకీ మధ్య దారిలోనే సెంట్రల్ స్టేషను. సెంట్రల్ స్టేషనులో ప్రయాణికులు సామానులు దాచుకోటానికని ప్రత్యేకించి ఒకగది వుంటుంది. సామాను ఒక్కంటికి రోజుకి రెండణాల చొప్పున చెల్లిస్తే రైల్వేవారు ఆ గదిలో దాచుకోనిస్తారు.

కదిరివేలు చెక్కు మార్చాడు. నోట్లు తీసుకుని గబగబా సైకిలు తొక్కుకొని, సెంట్రలుస్టేషను పక్కనే ఉన్న మూర్ మార్కెట్టులోకి చొరబడ్డాడు. అక్కడ సెకండుహేండు వస్తువులు అమ్మే ఒక దుకాణంలో పాత సూటుకేసు ఒకటి కొని, దానిలో నోట్లన్నీ కూరాడు. అక్కడనే ఒకచిన్న తాళంకూడా కొని పెట్టెకు వేసి సెంట్రలులో సామానులగదికి వెళ్ళేడు. రెండు అణాలు చెల్లించి ఆ పెట్టెను అక్కడ వప్పచెప్పేడు. అక్కడ గుమాస్తా, కదిరి వేలుపేరు రాసుకొని, రసీదు ఇచ్చాడు. కదిరివేలు బయటకొచ్చి, తోలుసంచీ నిండుగా రాళ్ళుకుక్కి, దారిలో ఎదురయ్యే బక్కింగ్‌హామ్ కాలవలోకి దానిని గిరాటు వేశాడు. చొక్కా, పంచా చింపుకొన్నాడు. జుట్టు రేపేసుకున్నాడు.

ఫ్యాక్టరీ చేరుకుని ఏడుస్తో యజమాని గది చొరబడి, 'బాబోయ్, కొంప మునిగి పోయింది! నలుగురు జమాజెట్టీలలాంటి వాళ్ళు నన్ను అపుచేసి బలవంతంగా రూపాయిలసంచీ లాక్కుపోయారు!' అంటూ, నిజంగా జరిగినట్టే నమ్మకం కలిగేట్టు చెప్పాడు.





యజమాని నిర్ఘాంతపోయాడు. 'సొమ్ము పోతేపోయింది. ఆ దుర్మార్గులు నిన్ను ప్రాణాలతో వదిలిపెట్టేరు నయం' అంటూ కదిరివేలును ఓదార్చి, వెంటనే ఆయన పోలీసులకి టెలిఫోన్ చేశాడు.

మరోగంటకి పోలీసు ఇనస్పెక్టరు వచ్చి, వాకబుచేశాడు. కదిరివేలును చాలా చాలా ప్రశ్నలు అడిగేడు. వాడు అన్నింటికీ తడుముకోకుండా జాగ్రత్తగానే జవాబులు చెప్పాడు.

ఇనస్పెక్టరు తిరిగి వెడుతో యజమానితో రహస్యంగా, 'అయ్యా, కొంపతీసి ఇది మీ గుమాస్తా ఆడుతోన్న నాటకంకాదుగదా! అతడు నమ్మకస్థుడేనా?' అని అడిగాడు.

అందుకు యజమాని, 'ఎంతమాట! కదిరివేలు చాలా యోగ్యుడు! నాకు తలలో నాలుకలాంటివాడు!' అన్నాడు.

'సరే అలాగైతే...' అంటూ ఇనస్పెక్టరు వెళ్లిపోయాడు.

తక్కిన గుమాస్తాలంతాకూడా కదిరివేలుని ఓదార్చేరు. అతడి మనస్సు బాగుండలేదని తోచి యజమాని వాణ్ణి ఆరోజున అందరికంటే ముందుగానే ఇంటికి వెళ్ళిపోవచ్చునన్నాడు.

కదిరివేలు ఇంటికిపోయి, ఆ చిరుగుల దుస్తులు మార్చేసి, అత్రంతో సెంట్రల్ స్టేషనుకు బయల్దేరేడు.

దారిలో కదిరివేలు 'ఏడువేలరూపాయల పైచిల్లర! ఇందులో ఒక్క రూపాయికూడా ఇప్పుడు ముట్టుకోను! మెల్లిగా బంగారం కొనేసి ఒకచోట పాతిపెట్టేస్తాను! ఐదారేళ్లు గడిచి ఈ సంగతి అందరూ మరిచిపోయాక ఏదో వంకబెట్టి ఈ నౌకరీ మానేసి మరో చోటికి పోయి, ఏ వ్యాపారమో పెట్టి వృద్ధి చేస్తాను. లేకపోతే భూములు. కొంటాను!' అని గాలిమేడలు కట్టుకుంటూ స్టేషనుకు చేరుకున్నాడు.

అక్కడ గుమాస్తాకు రసీదు ఇచ్చి, 'నా పెట్టెయివ్వండి సార్' అన్నాడు.

ఆ గుమాస్తా అదోరకంగా చూస్తో 'ఇదే నాండి మీ సూట్‌కేసు ?' అన్నాడు.

'ఔను' అంటూ కదిరివేలు దాన్ని తీసి చంకనబెట్టుకుని రెండు అడుగులు వేశాడో లేదో, ఎవరో వెనకనుంచి అతని భుజం పట్టుకున్నట్టయింది. తిరిగి చూడగా పోలీసు!

'ఎందుకయ్యా నన్ను పట్టుకుంటావ్ ?' అని దబాయించాడు కదిరివేలు.

'ఆ సూటుకేసు నీకెక్కడిది?' అన్నాడు పోలీసు.

'ఎక్కడిదేమిటి? నాదే!' అన్నాడు కదిరివేలు.

"నాదే అంటే చెల్లుతుందా? ఇది 'కిషోర్‌లాల్' అనే నగల వర్తకుడిది. చూడు, ఈమూల చిన్న అక్షరాలతో ఉన్న ఆయనపేరు! ఆయన రైల్లో ప్రయాణం చేస్తోంటే ఈ పెట్టెతో సహా మరికొన్ని సామాన్లు కొట్టేశావు. అవునా!" అన్నాడు పోలీసు.

'నాకు కిషోర్‌లాల్ పెట్టె సంగతేమీ తెలియదు. ఈ పెట్టె నేను డబ్బిచ్చి కొనుక్కున్నాను' అని గోలపెట్టేడు. కదిరివేలు.

అప్పుడు పోలీసు 'అదంతా ఇనస్పెక్టరుతో చెబుదుగాని పద. నడు త్వరగా' అని ఇనస్పెక్టరుదగ్గిరకు వాణ్ణి లాక్కుపోయాడు.

ఇనస్పెక్టరు కదిరివేలును చూడ్డంతోనే, 'మధ్యాన్నం సొమ్ము దోచుకున్నారన్న ఫ్యాక్టరీ గుమాస్తా అతడే'నని గుర్తు పట్టాడు. పెట్టెతాళం తీయించి చూసేసరికి అందులో పోయాయనుకున్న నోట్లన్నీ ప్రత్యక్షమయాయి. కదిరివేలుకి న్యాయాధిపతులు ఏడు సంవత్సరాలు శిక్షవిధించారు!

ఎంత జాగ్రత్తగా చేశామనుకున్నా దుర్మార్గం ఇలాగే తలవనితలంపుగా బయట పడిపోతుంది!






మాడుగుల మన్యంలో మంగన్న ఒక కోయవాడు. వాని తొలిభార్యకు ఇద్దరు బిడ్డలు—సింగన్న అనే కుర్రాడు, దుర్గాలు అనే ఆడపిల్లాను. మంగన్న భార్యకు సవతి బిడ్డలంటే కంటగింపుగా వుండేది.

పసిపాప దుర్గాలు వట్టి అమాయకురాలు. సవతితల్లి బాధపెట్టినప్పుడల్లా భోరుమని యేడ్చేది. ఐతే, గుండెనిబ్బరంగల సింగన్నమాత్రం "నేనుండగా నీకేమి భయంచెల్లాయ్" అంటూ ఊరడించేవాడు.

బిడ్డల పీడ వదుల్చుకుంటే తెరపిగా ఉండవచ్చుననే వూహతో సవతితల్లి అస్తమానం ఏదో ఒక పన్నాగం పన్నుతూనే వుండేది. పాపం, బిడ్డలు ఆమె పెట్టిన హింసలన్నిటినీ భరిస్తూనే వచ్చారు.

ఒకరోజున ఆమె బిడ్డలతో 'ఫలానా అడవిలో మనకు అవసరమైన మూలికలున్నై. వాటిని ఎలా ఐనా పట్టుకరావాలి' అని చెబుతూ మనిషిని తోడిచ్చి పంపించింది. సింగన్న ధైర్యశాలిమాత్రమే కాదు, యుక్తిపరుడు కూడాను. సవతితల్లి పెట్టే చిక్కులన్నీ వాడు మొదటినించీ గ్రహిస్తూనే వున్నాడు. ఇప్పుడు తననూ దుర్గాలునూ ఓషధులకని అడవులకుపంపటం ఒక మిష తప్ప మరేమీ కాదని వాడికి తెలుసు. వెళుతున్నప్పుడు వెంటవచ్చిన మనిషికి తెలియకుండా వాడు తనవద్ద ఉన్న గులకరాళ్లను దారిపొడుగునా వేస్తూ వచ్చాడు.

ఒక కీకారణ్యం చేరుకున్నాక పసివాళ్లు అలిసిపోయారు. తోడువచ్చిన మనిషి వాళ్లతో 'మీరీ చెట్టునీడని కూర్చుని బడలిక తీర్చుకోండి. నేను పోయి ఓషధులు పట్టుకువస్తాను' అని చెప్పి, వాళ్లకు తెలియకుండా మరొకదోవని ఇంటికి వెళ్లిపోయాడు.

బిడ్డలకు మెలకువ వచ్చేటప్పటికి సాయంకాలమైంది. మరి కొంచెంసేపటికే

బి. వి. రమణ - పుదుచ్చేరి



వెన్నెలకూడా వచ్చేసింది. చెల్లెలికి ధైర్యం చెప్పి, సింగన్న బయల్దేరాడు. తను పడ వేస్తూవచ్చిన గులకరాళ్లు వెన్నెలవెలుగులో తళతళ మెరుస్తూ, స్పష్టంగా దారి చూపించినై. ఆ ఆనవాలుతో వాళ్లు సులువుగా అడవి దాటేసి, ఇంటికి చేరుకోగలిగారు.

వదిలిపోయారనుకున్న సవతిబిడ్డలు మళ్ళీ కంటబడేవరకు మంగన్న భార్య వాళ్లమీద మండిపడింది. మరునాడు వాళ్లకు కాసిన్ని గంజినీళ్ళు పోసి, మాడు రొట్టెలు పడవేసి మనిషిని తోడిచ్చి మళ్ళీ మరొక అరణ్యానికి పంపించింది. ఈ మారు రాళ్ళు తేవటానికి సింగన్నకు వ్యవధి లేక పోయింది. అందుకని తల్లియిచ్చిన రొట్టెను ముక్కలుచేసి దారిపొడుగునా వేశాడు.

ఈమాటుకూడా తోడువచ్చినవాడు బిడ్డలను ఏమార్చి వెళ్లిపోయాడు. రొట్టె ముక్కలు ఆనవాలు వేశాంకదా, ఇట్టె దారి కనుక్కోవచ్చు అనుకొని సింగన్న నిబ్బరంతో వున్నాడు. తీరా ఇంటికి పోదామని బయల్దేరేసరికి, తను పడవేసిన రొట్టె ముక్క ఒక్కటీ ఆనవాలు దొరకలేదు. తినేవస్తువుగనుక ఏపక్షులో కబళించి వుంటై అని వాడు గ్రహించాడు.

అలా పోగాపోగా మినుకు మినుకుమని మెరుస్తూ ఒక దీపంవెలుగు కనపడింది. అదేదో ఊరు ఐవుంటుందని తలిచి, వాళ్ళు అటువైపు వెళ్ళారు. చూడగా అది ఊరు కాదు, ఒక గుడి. గుడి గోపురంనిండా జీవకళ ఉట్టిపడే రకరకాల బొమ్మలున్నై.

సింగన్న ఊరుకోక గోపురంమీదనుండే ఒక చెట్టుకాయ కోసి నోట పెట్టుకున్నాడు. వెంటనే గణగణ గంట మ్రోగింది. గుడి తలుపులు తెరుచుకున్నయి. ఒక వృద్ధురాలు లోపలినుండి వచ్చి, 'రండర్రా పాపలూ!—మీకోసమే చూస్తున్నా' నంటూ ఎంతో అప్యాయంతో బిడ్డలను చేరదీసుకుని

లోపలికి తీసుకుపోయింది. కన్నతల్లికంటె ఎక్కుడుగా ఆదరించింది. నవకాయ పిండి వంటలతో భోజనం పెట్టి, చక్కా చెరివక పక్కా వేసి వాళ్లను నిద్రపుచ్చింది.

రాత్రిపూట వాళ్ళు గాఢనిద్రలో వుండగా సింగన్నమంచం ఒకగదిలోకి చేర్చి, వానిని బంధించివేసింది ముసిలిది. మరునాటి నించీ దుర్గాలును పాపం, రాసి రంపానపెట్ట సాగింది. సవతితల్లిపీడకంటె ఎక్కువయి పోయింది ఇప్పుడీ ముసిలిదాని పీడ.

ఐతే, ఇన్నికష్టాలలోనూ ఒక్క సుగుణ మున్నది: ఎందుకోసమో సింగన్నను మట్టుకు ముసిలిది రోజూ పంచభక్ష్య పరమాన్నాలతో మేపుతూవచ్చింది. ఈ భక్ష్యాలన్నీ చెల్లెలే అన్నగారికి కటకటాలలో నించి అందించేది. ఆ సమయంలో ఇద్దరూ ఒకళ్లనొకళ్ళు ఓదార్చుకొనేవాళ్ళు.

వృద్ధురాలు రోజూ సాయంకాలం సింగన్న గదివద్దకువచ్చి, క్షేమం కనుక్కుని, 'ఏది నాయనా నీచెయ్యి!' అంటూ వాని వేళ్ళు తడిమి చూసేది. యుక్తిపరుడైన సింగన్న ఒక పుల్లముక్క చేతికి అందించే వాడు. 'ఇంకాబలవలేదా!' అనిచెప్పి ఆమె విసుక్కొంటూ పోయేది.



ఒకరోజున ఆమె 'బలవనీ మాననీ, రేపు కబళించివేస్తా' నంటూ గొణగసాగింది. ఆనాడు రహస్యంగా మూలనుండే బ్రహ్మాండ మైన పొయ్యి ఒకటి బాగుచేసింది. ఆ పొయ్యి దిగువని మనిషి పట్టేటంతటి చోటున్నది. పొయ్యికి సరిపడిన పెద్ద పెనమొక టున్నది. ఈ సందర్భాలన్నీ దుర్గాలు అన్నతో చెప్పేసరికి, ఇన్నాళ్ళనించీ ముసి లిది తనను ఎందుకిలా మేపుతున్నదో చిటికలో పసికట్టాడు.

రాత్రికాగానే ముసలిది సింగన్న గదికి వచ్చి, 'నాయనా!—ఇవాళ దేవికి నివేదనచేయాలి. కాస్త పొయ్యి విసిరి

పెడుదూ' అని చెప్పి, ఎదురుగా ఒక పీట వేసి కూర్చోమన్నది. అందుకు సింగన్న 'అవ్వా అవ్వా!—మా దేశంలో ఇటువంటి పొయ్యిలూ పెనాలూ ఎరగం. నీవొకసారి విసిరి చూపిద్దూ' అన్నాడు. ముసిలిది కోపంతో హుంకరిస్తూ 'ఈపాటి తెలియదా, వాజా!—ఇడుగో ఇలాగ్గా విసరాలి' అంటూ పీటమీద చతికిలబడి, వంగొని విసర బోయింది. ఆమె అలా వంగొని విసురుతూ వుండగా సింగన్న సూటిచూసి, ఆమెను లోనికి నెట్టి పొయ్యితలుపులు రెండూ బిగించాడు.

అప్పుడు గుడిలోని గంటలన్నీ ఒక్క సారిగా గణగణ మ్రోగినై. ఆ క్షణమందే గోపురంమీది బొమ్మలన్నీ జీవంతో దిగివచ్చి సింగన్నకు నమస్కరించినై. అందరూ కలిసి ముసిలిది ఏమైందో చూదామని పొయ్యివద్దకు వెళ్లగా, ఆ పొయ్యి ఒక చిత్రమైన పెట్టెగా మారిపోయింది. దాని మీద 'మాయారాక్షసిని చంపిన మహానుభావులారా! ఈ గద్దెపైన కూర్చోండి. మీకోరికలు చెప్పండి!!' అని ఉన్నది.

అందరూ సంతోషంతో జేజేలుకొడుతూ "మీరే మహానుభావులు. గద్దె యెక్కండి!" అంటూ సింగన్ననూ, దుర్గాలునూ పెట్టెపైనున్న కుర్చీలమీద కూర్చోబెట్టారు. ఇంటికి వెళ్ళాలనుకున్నాడు సింగన్న. అందరూ చూస్తూవుండగానే ఆ చిత్రమైన పెట్టె విమానంలాగా ఎగిరిపోయింది.

బిడ్డ లిద్దరూ ఇంటికి వెళ్ళేసరికి, అప్పటి కప్పుడే దుష్టచింతగల వాళ్ళ సవతితల్లి పిట్టకు తెలియకుండా మటుమాయమైంది.

మంగన్న యిప్పుడు మనసారా బిడ్డలను చేరదీసుకొని ముద్దులాడాడు. సింగన్న ప్రజ్ఞను అందరూ కొనియాడారు. చిత్రమైన పెట్టె కోరుకొన్నదల్లా యిస్తూవుండటంవల్ల మంగన్న కుటుంబం సిరి సంపదలతో తుల తూగుతూ సుఖంగా వున్నారు.






ఒక మహారణ్యంలో ఒకానొక దంపతులు కట్టెలు కొట్టుకుని జీవనం చేసేవాళ్లు. వాళ్ళకు చంద్ర అనే చక్కని చుక్క కూతురు. చంద్ర చాలా మంచిపిల్ల. ఆ పిల్లకు అడవిలో వుండే దెయ్యాలూ దేవతలూ తెలుసు. వాళ్లు ప్రయోగించే మంత్రాలూ మహిమలూ తెలుసు.

చంద్ర ఇంటిపొరుగునే మల్లు అనే కుర్రవాడు ఆమెకు నేస్తగాడు. చంద్ర యెంత మంచిదో మల్లు అంత గడుగ్గాయ, సాహసి, దురుసున్ను. చంద్ర యెనిమిదో యేట పుట్టినరోజు పండగకు వాళ్ళమ్మ ఒక చిత్రమైనబొమ్మ బహుమతి ఇచ్చింది. ఆ బొమ్మకు చంద్ర ముస్తాబు చేసింది. 'బంగరుపాప' అని పేరుకూడా పెట్టుకుంది.

బంగరుపాపను చంకనిపెట్టుకుని ఒక రోజున ఆమె అడవులలోకి ఆడుకోబోయింది. అంతలోనే మల్లుగాడు ఎక్కడినించో పరుగుపరుగున రొజుకొంటూ వచ్చాడు. 'ఏమిరా మల్లూ!—ఎందుకంత కంగారు?' అని చంద్ర వానినడిగింది.

'కంగారూలేదు, యేమీలేదు. ఇదుగో గమ్మత్తు'...అంటూ, చొక్కాకింద దాచి తెచ్చిన ఒకవస్తువు తీసిచూపించాడు. అది ఒక బంగరుపాత్ర. ఆ పాత్రనిండా ధగధగ మెరిసిపోయే వరహాలు చూసేసరికల్లా చంద్రకి కన్నులు జిగాల్‌మన్నయ్.

'ఓరి నీగోల కూలా! ఇదెక్కడ దొరికిందిరా నీకు? ఇది 'మరుగుజ్జులు' సంపాదించుకొన్న బంగరు పాత్ర. నూరేళ్ళు శ్రమపడి వాళ్ళు దీనిని సంపాదించారు. వాళ్ళ మనసు బాధపడిందంటే, దీనిని దొంగిలించినవాళ్ళకు చెప్పరాని చిక్కులు కలుగుతై. అందుకని, యెక్కడనుండి తెచ్చావో అక్కడనే పెట్టేసిరా, పో!' అని మందలించింది చంద్ర.

కె. రామలక్ష్మి - చోడవరం



కనుమూసి తెరిచేటంతలో చంద్ర చంకని వున్న బంగరుపాపను యెగరేసుకుని చక్కాపోయారు.

పాపం, చంద్ర బిత్తరపోయింది. ఐతే అంతలోనే ధైర్యంతెచ్చుకున్నది. ఆ మరుగుజ్జులు నివసించే కలుగు తనకుతెలుసు కనుక ఆ కలుగుదగ్గిరికిపోయి వాళ్ళని ఏదో విధంగా వేడుకుని, వాళ్ళమనస్సు కరగించి తన బంగరుపాపను తెచ్చుకుందామని నిశ్చయించుకుంది. అదేప్రకారం బయలుదేరి వెళ్ళి మరుగుజ్జులుండే కలుగు దగ్గరకు చేరుకుంది. 'వోయ్ మరుగుజ్జులూ!— నా బంగరుపాపను నాకు యిచ్చివేయండయ్యా!!' అని శతవిధాల బతిమలాడింది.

'ఈం—పాప కావాలేం నీకు? పట్టుకరా, పో, మా బంగరుపాత్ర పట్టుకువచ్చి మరీ మాటాడు' అంటూ అందరూ ఒక్కపెట్టున వెటకారంగా నవ్వారు.

ఇప్పుడు చంద్రకు ఆరాటం మరింత యెక్కువైంది. వామనులు తన బొమ్మను యెత్తుకపోయారే అని విచారం ఒకవంక. ఇంటికి వెళ్ళగానే 'అమ్మాయీ!—బొమ్మ యేదే?' అని వాళ్ళమ్మ అడిగితే యేమని చెప్పటమా అనే భయం ఒకవంక. అందు

'ఈ పిచ్చికబుర్లకేమిలే, పోదూ' అని నిర్లక్ష్యంగా నవ్వేశాడు మల్లు. అంతలోనే యేదో అలికిడి ఐంది. ఒక్కక్షణంలో వందలూ వేలూ మరుగుజ్జులు, బిలబిలమంటూ అక్కడికి వచ్చేశారు. మల్లుగాడు కాలికొద్దీ పరుగుచ్చుకొని, వెనుకకు తిరిగి చూడకుండా పారిపోయాడు.

ఆ వచ్చిన మరుగుజ్జులు భూమికి అరంగుళాల యెత్తున వున్నారు. వాళ్ళకు పదేసి అంగుళాల పొడవు గెడ్డాలున్నై. పచ్చటి దుస్తులూ, మిఠాయిపొట్లాలలాగా చివరని కోసుతేరివున్న గుడ్డటోపీలూ వున్నయి. వాళ్ళు వచ్చినట్టే వచ్చి,

చేత చంద్ర తిన్నగా యింటికి పోలేదు. కొండమీదవుండే పసులకాపరిదగ్గిరికి పోయి, తనకు వచ్చినకష్టం వలపోసుకొన్నది. అసలు, మరుగుజ్జులనుగురించీ వాళ్ల బంగరుపాత్రను గురించీ చంద్రకు చెప్పింది ఈ పసులకాపరే.

'అమ్మడూ, నీకువచ్చిన భయంలేదు. ఇదుగో, ఈ వేరుముక్క నీవద్ద వుంచుకో. ఇదివుంటే మరుగుజ్జులు నిన్నేమీ చేయలేరు, ఇది తాకితే వాళ్ళ మంత్రాలూ తంత్రాలూ పనిచెయ్యవు' అనిచెప్పి ఒక వేరుముక్క చేతికిచ్చాడు. 'ఐతే - వాళ్లకు బాధ కలిగిందంటే ఏమన్నాచేసిపోతారు. కనుక, వాళ్ళ బంగరుపాత్ర వాళ్ళకు వప్పగించేసేయమని మల్లుగాడితో చెప్పు' అని సలహా ఇచ్చాడు.

ఇంటికిబయలుదేరింది చంద్ర. అయితే, దారిలోనే పిడుగువంటివార్త ఒకటి చెవిని పడ్డది. తన నేస్తుడు మల్లుగాడు బండికింద పడ్డాడట. వంటినిండా గాయాలు తగిలినాయట!! 'అయ్యో!—నేను అనుకున్నంత పనీ జరిగింది. పశువులకాపరి చెప్పినంతా అయింది. మా మల్లుకు అప్పుడే మరుగుజ్జులు పెట్టిన శాపం తగిలేసింది!!' అని అనుకుని ఆమె దుఃఖించసాగింది.




ఈ స్థితిలో యేమి తోస్తుంది చంద్రకు ? తలవని తలంపుగా ఇప్పుడు రెండు విపత్తులు వచ్చిపడినై. తనకు ప్రాణసమానమైన బంగరుపాపను మరుగుజ్జులు కాజేసి పోయినారాయె. వాళ్ళశాపంవల్ల తన నేస్తుడైన మల్లుకు అప్పుడే చిక్కులు ప్రారంభమయినై. గత్యంతరం యేమిటా అని ఆలోచిస్తూనే యిల్లు చేరుకున్నది.

అప్పుడే మల్లుయింటికిపోయి మరలి వచ్చిన చంద్ర తలిదండ్రులు 'అమ్మా చంద్రా!—మన మల్లుకు అమితంగా జ్వరం వచ్చేసింది. ఆ జ్వరంలో వాడు 'ముళ్లతుప్ప...ముళ్లతుప్ప...చంద్రతో



చెప్పు...' అంటూ పలవరిస్తున్నాడు. ఆ ముళ్ళతుప్పసంగతి నీకు ఏమైనా తెలుసా తల్లీ?' అని అడిగారు.

అందుకు చంద్ర 'ఏముళ్ళతుప్ప అని చెప్పాడే అమ్మా!' అని ఆత్రంతో అడిగింది. తల్లికి తెలియులేదు. 'ఐతే, నేనుపోయి కనుక్కువస్తా' నన్నది చంద్ర. కాని, తల్లి ఆమెను వెళ్ళనివ్వలేదు. చంద్రకి మనసులో ఆందోళన ప్రారంభమైంది. రాత్రి అందరూ పడుకొన్నసమయుంచూచి ఆమె మల్లుయింటికి ఉడాయించింది.

చంద్ర వెళ్ళేసరికి అక్కడ మల్లుకు వచ్చేప్రాణం, పోయేప్రాణంగా వున్నది. కంగారుతో చంద్ర లోపలకువెళ్లి, "పిన్నీ!— ఏముళ్ళతుప్ప అని చెప్పాడు తమ్ముడు?" అని మల్లుతల్లిని అడిగింది.

అందుకు ఆమె 'యేదో మర్రిచెట్టుకింద ముళ్ళతుప్పట!' అని చెప్పింది ముక్తసరిగా.

ఈమాట వినగానే 'సరే, తమ్ముడికి నయమవుతుందిలే!' అంటూ చంద్ర తిన్నగా పెద్ద మర్రిచెట్టుకిందకు వెళ్ళింది. అక్కడ తుప్పలో బంగరుపాత్ర కనిపించింది.

ఆపాత్ర పట్టుకుని ఒక్కపరుగున ఆమె మరుగుజ్జులుండే కలుగువద్దకు వెళ్ళి పిలిచింది. బిలబిలమంటూ వేలకొద్ది మరుగుజ్జులు వచ్చేసి, ఆమెను చుట్టివేశారు. 'ఓయి మరుగుజ్జులూ!—ఇదిగో మీ బంగరుపాత్ర. ఇది తీసుకుని, మా మల్లుకు వొళ్లు నయంచేయండయ్యా, పుణ్యముంటుంది' అని దీనంగా బతిమలాడింది.

అందుకు వాళ్లు అందరూ కలసి ఒక్కపెట్టున వెటకారంగా నవ్వుతూ 'నీవు ఏమికోరినా ఇస్తాముగాని, మల్లుగాడిసంగతి మట్టుకు యెత్తకు. వాడు గజదొంగ, మాయలమారి, దుర్మార్గుడు. ఈమారు వాడికి తగినశాస్తి చేస్తేగాని వదిలేదిలేదు,' అన్నారు కోపంగా.

అందుకు చంద్ర 'నాకు మా మల్లుగాడి ఆరోగ్యమే కావాలి. అదితప్ప మీరేమిచ్చినా నాకు అక్కరలేదు,' అని పట్టుపట్టింది.

అప్పుడు మరుగుజ్జులు ఆలోచనలో పడ్డారు. వాళ్లలోవాళ్ళు వాదనలు జరుపుకొన్నారు. చివరకు ఎలాఐతేనేం, చంద్రను కటాక్షించి మల్లుగాడిని రక్షించటానికి వాళ్లు నిశ్చయించేసుకొన్నారు. వాళ్ల మంత్ర మహిమవల్ల చంద్రకు నించున్నపాటునే కునుకుపట్టేసింది. ఆమెకు మెలకువవచ్చి చూచేటప్పటికి బంగరుపాత్రా లేదు, మరుగుజ్జులూ లేరు !!

అప్పటికి సరిగా తెలతెల్లవారుతున్నది. చంద్రకి మెలకువవచ్చి కళ్ళుతెరిచి చూచేసరికి పసులకాపరిని వెంటబెట్టుకుని ఆమెను వెతుక్కొంటూ వచ్చిన తన తండ్రి యెదట నిలబడివున్నాడు.

అతడు చంద్రను యెత్తుకుని ముద్దాడి, తనవెంట ఇంటికి వచ్చేసెయ్యమన్నాడు. కాని ఆమాట వినిపించుకోలేదు ఆమె. తండ్రి కంటబడేసరికల్లా చంద్ర 'నాన్నా !—మన మల్లుకు ఎలావున్నది? ముందు ఆ సంగతి చెప్పు?' అని యెంతో ఆత్రంతో అడిగింది.



'నయమైపోయింది తల్లీ !—ఘనవైద్యులంతావచ్చి చికిత్సచేశారు. ఒక్కరోజులో నిమ్మళించేసింది' అని చెప్పాడు తండ్రి.

అందుకు చంద్ర 'నాన్నా !—పిచ్చివాడవల్లేవున్నావే! ఆ జబ్బేమిటి, వైద్యులు నయంచేయడమేమిటి? మరుగుజ్జులుపెట్టిన శాపంవల్లనే మల్లుకు ఇన్నికష్టాలు కలిగినై. వాళ్ళిప్పుడు శాపం తీసివేశారు. అందుకనే అంతలో నిమ్మళించింది. ఇదంతా వాళ్ళ మహిమేగాని మరొకటికాదు' అని చెప్పింది.

ఈ మాటలు అతనికేమీ అర్థంకాలేదు. కాని, తోడువచ్చిన పశువులకాపరిమాత్రం అంతా గ్రహించాడు.

తండ్రి యెంత బతిమాలినా చంద్ర ఇంటికి పోలేదు. 'నేను తర్వాతవస్తాను. మీరు వెళ్ళండి' అన్నది. అప్పుడు తండ్రి 'అబ్బాయీ! నీవు కూడావుండి చంద్రను వెంటబెట్టుకురా' అంటూ పసులకాపరికి వప్పజెప్పాడు. వాళ్లు మరలిపోగానే ఆమె మళ్ళీ కలుగువద్దకు పోయి మరుగుజ్జులను పేరుపెట్టి పిలిచింది. వాళ్ళు బిలబిల మంటూ వచ్చేశారు. 'వోయ్ మరుగుజ్జులూ!—బంగరుపాత్ర మీకు ఇచ్చేశాను కదా, ఇంకా నామీద కోపమెందుకయ్యా? నా బంగరుపాపను నాకిచ్చివేయండి. అది లేకుండా నిమిషమైనా నిలువలేను' అని జాలిగా వేడుకుంది.

అందుకు వాళ్లు 'చంద్రా!—మా పాత్ర మాకు ఇచ్చివేయటం చేసినతప్పు దిద్దుకోవడమన్నమాట. అలా దిద్దుకొనటం చేతనే మీమల్లుకు వళ్ళు నయమైంది. ఐనా, నువ్వెంతగా ప్రాధేయపడుతున్నావు గనుక ఒకపని చెయ్యి. మేము ఒకపాట చెబుతాం. దానిని గబగబ ముప్పయిసార్లు పాడు. సరిగా పాడితే నీపాపను నీకు ఇచ్చివేస్తాం,' అన్నారు. ఎంతో ఆత్రంతోనూ సంతోషంతోనూ చంద్ర ఆపాట చెప్పమనగా వాళ్ళు ఇలా చెప్పారు:—

"వాలా - ఊలా - జాలా - బూలా!
ఊఫీ - ఊఫీ - ఊ... !
ఊంఫా - ఫుంఫా - డుంఫా - ముంఫా!
వూఫీ - వూఫీ - వూ...!!"

ఈపాట పాడటానికి చంద్ర యెన్నో సారులు యత్నించింది. కాని పాపం!—నోరు తిరగలేదు.

'సరే, నువ్వు యెప్పుడు పాడగలిగితే అప్పుడు మళ్ళీరా' అని చెప్పి మరుగుజ్జులు కలుగులో దూరిపోయారు. ఈపాట వస్తేనే తప్ప తనకు బంగరుపాప దక్కదాయె. అందుకని చంద్ర ఇప్పటికీ ఆ పాట అలా సాధకంచేస్తూనే వుంది !!!






ఒక పట్టణసమీపంలో పెద్ద రావిచెట్టు ఒకటి ఉంది. ఆ చెట్టులో ఒక తొఱ్ఱవుంది. ఆ తొఱ్ఱలో భరతపక్షి ఒకటి గుడ్లుపెట్టి, వాటిని పొదిగింది. ఐతే ఆ పిల్లలకింకా రెక్కలు రాలేదు. తల్లిపక్షి రోజూ అడవికిపోయి ఆహారం తెచ్చి పిల్లలకి పెడుతూండేది.

తల్లిపక్షి గూడువదిలి వెడుతూన్నప్పుడల్లా ఆచెట్టు సమీపంలో విచ్చలవిడిగా గంతులేస్తో ఒకలేడి కనబడుతోండేది. ఆ లేడి అక్కడాఅక్కడా కనపడ్డ పచ్చగడ్డితో కడుపు నింపుకొని, ఆ దగ్గర సెలయేటి నీటితో దాహంతీర్చుకొని ఎవరిజోలికీ పోకుండా రోజులు వెళ్లబుచ్చుతూవుంది.

ఆ సాధుజంతువుని చూసినప్పుడల్లా తల్లిపక్షికి యెంతో జాలి కలిగేది. ఎందుచేతనంటే, అది తన పిల్లలకు ఆహారంకోసం తిరుగుతూవున్నప్పుడు, వేటకాళ్లు విల్లూ అమ్ములూ పుచ్చుకొని జంతువుల కోసం వెతుకుతూండడం ఎన్నోసారులు కళ్లారా చూచింది.

"ఆ కిరాతకులలో ఎవడికంటపడ్డా, ఈ లేడిప్రాణాలు దక్కవుకదా పాపం!" అనుకునేది ఆ పక్షి.

ఒకనాడు గూడువిడిచి వెడుతో, ఎదురుపడ్డ లేడిని ఆపి, "నేస్తం! నీకు తెలుసోలేదో, యముల్లాళ్ళకిమల్లే, నాకు యెక్కడ చూచినా వేటగాళ్ళు కనపడుతున్నారు. నువ్వు కాస్త జాగ్రత్తగా వుండాలిసుమా. ఇలా నిర్భయంగా యెక్కడపడితే అక్కడ సంచరించటానికి వీల్లేదు. నరుల కంట పడకుండా ఏ పొదలమాటునో మసలాలి" అని హెచ్చరించింది.

లేడి చిరునవ్వు నవ్వి, 'పిన్నీ, నామీద ప్రేమకొద్దీ నువ్వు చెప్పిన మాట కాదనకూడదుగాని, మనవంటి సాధుప్రాణుల్ని కాపాడటానికి ఆ భగవంతుడే వున్నా'డంది.

సి. హెచ్. దీనదయాళు - మల్లేశ్వరం



అందుకు పిట్ట, "ఈ వేదాంతాని కేంలే. ఐనా, జాగ్రత్తగా వుండు" అని మళ్ళీచెప్పి, తనదారిని తను వెళ్ళింది.

పిట్టకీ, లేడికీ జరిగిన సంభాషణను ఆ పక్క పొదలో పొంచివున్న పాము ఒకటి వింటూనేవుంది. అటు పిట్టా, ఇటు లేడీ వెళ్ళిపోగా చూచి, పాము పకపకా నవ్వటం ప్రారంభించింది.

తేలొకటి ఆ నవ్వువిని, "ఏమిటన్నా! అంతగా విరగబడి నవ్వుకుంటున్నావు?" అని అడిగింది. పిట్టా లేడీ అనుకున్న మాటలు పాము దానితో చెప్పి, 'తమ్ముడూ, తనే అక్కడికి జాగ్రత్తపడ్డదానికిమల్లే ఈ పిట్ట లేడికి సలహా చెప్పవచ్చింది! తను పడ్డ జాగ్రత్తేమిటో మహా! ఆ నాలుగు పిల్లల్నీ గూట్లోవదిలి చక్కాపోయిందికద!' అని మళ్ళీ నవ్వటం మొదలెట్టింది.

ఆ నవ్వెందుకో తేలుకి అర్థంగాక, 'పక్షి పిల్లలెక్కడికి పోతాయి? తల్లివచ్చేదాకా వెచ్చగా చెట్టుతొర్రలో వుంటాయి' అంది.

పాము నవ్వుతో ఇంతేనా నీ తెలివి? పిట్ట వచ్చేసరికి దానిపిల్లలు నా పొట్టలోనే వుంటాయిసుమా!' అంది. తేలు గ్రహించి, 'ఒహో, ఇదా నీవ్యూహం బాగానేవుంది' అంటూ తనదారిని వెళ్ళిపోయింది.

ఆ తేలు కొంచెందూరం వెళ్లేసరికి దానికొక వేటకాడు ఎదురయాడు. వాడు తేలును చూడలేదు. ఏమంటే వాడిదృష్టి అంతా రావిచెట్టువైపునే ఉంది. పిట్టదారిని పిట్ట వెళ్ళగా లేడి యేటిలో నీరుతాగి వచ్చి రావిచెట్టునీడని పడుకోటానికని వస్తో, వాడి కంటపడింది. వెంటనే వాడు వాడిబాణం ఒకటి తీసి, లేడికి గురిచూసి వదిలేడు.

ఆ సందడిలో క్రింద యేముందో వాడు చూసుకోక తేలుమీద అడుగువేశాడు. అది వాణ్ణి పుటుక్కున కుట్టింది; 'బాబోయ్!' అంటూ వాడు నేలకి ఒరగబడ్డాడు. బాణం






మాత్రం 'రంయ్'మంటూ వచ్చి, లేడికి పైగా అంగుళం ఎత్తున దూసుకుపోయి రావిచెట్టు మానుకు వెళ్ళి గుచ్చుకుంది.

అహారంపట్టుకొని పిట్ట చెట్టువద్దకు వచ్చే సరికల్లా లేడి నిశ్చింతగా నెమరువేస్తో రావిచెట్టునీడను పడుకుని ఉంది. 'ఏం నేస్తం, క్షేమమేకదా! ఇవేళ నాకు ఎదురైన వేటకాళ్ళ వరసచూస్తే నిన్ను నేను మళ్ళీ చూడగలననుకోలేదు' అంది పిట్ట.

'నిజమే పిన్నీ. ఈరోజు నువ్వు చెప్పినంతపనీ జరిగింది! బాణం ఒకటి 'రంయ్' మంటూ వచ్చి నా పైగా పోయి, చెట్టు మానుకు గుచ్చుకున్న చప్పుడయింది' అంది.

చెట్టువరకూ బాణం వెళ్ళిందనటంతోనే పిట్టగుండెలు కొట్టుకోడం మొదలెట్టేయి. 'కొంపతీసి ఆ బాణంగాని వెళ్ళి నాపిల్లలకి తగల్లేదుగదా!' అనుకొంటూ తొఱ్ఱదగ్గిరకి పరుగెత్తిపోయి చూసేసరికి ఏముంది? తొఱ్ఱకి ఒక్క అడుగుమేర క్రిందగా ఆ బాణం గుచ్చుకునివుంది. ఇంకాచూసగా ఆ బాణానికీ చెట్టుమ్రానుకీ మధ్య, మేకు తాపళంచేసినట్టుగా పాముపడగ అటుక్కుపోయి చచ్చి వేలాడుతోన్న నాగుపాము కనపడింది. భయంతో పిట్ట అరుస్తో, 'నేస్తం! నేస్తం! ఇలారా' అని పిలిచి, వేలాడుతోన్న ఆపాముని చూపించింది.

అప్పుడు లేడి, "పిన్నీ, నామాటలు మెట్టవేదాంతమని తోసేశావుకాని నేను చెప్పింది అక్షరాలా నిజమైందోలేదో చూడు. సాధువుల్ని రక్షించటానికి పూనుకున్న ఆ భగవంతుడే నన్నూ నీపిల్లల్నీ కూడా కాపాడేడు. భగవంతుడు ఎంత చిత్రంగా రక్షించాడో చూడు! నన్ను చంపటానికి వచ్చిన ఈబాణంతో, నీపిల్లల్ని పొట్టనిపెట్టుకుందామని తొర్రకు ఎగబ్రాకిన ఆ క్రూర సర్పాన్ని సంహరించాడు," అంటూ దేవుని అద్భుతపరిపాలననుగురించి విప్పిచెప్పింది.






ముక్తీశ్వరంలో ఒక పెద్ద కోనేరున్నది. ఆ కోనేటి చుట్టూతా కొన్ని యిళ్లు ఒక అగ్రహారంగా యేర్పడినై. దానికి 'కోనేటి అగ్రహారం' అని పేరు. అగ్రహారపు బ్రాహ్మలలో కుక్షిపావనమైన వాళ్లు ఉన్నారు. వాళ్లు నామకరణం మొదలుకుని పెళ్ళిళ్ళవరకూ నువ్వా నేనా అని చేయించ గలరు. వాళ్ళ ఆదాయంకూడా పుష్కలం గానే వుంటుంది.

ఈ పురోహితులు గాక, అగ్రహారంలో మరి రెండువందలవరకూ బ్రాహ్మణగడప వున్నది. ఐతే వీరికి మంత్రాలూ అవ్వీ యేమీ రావు. మరి, వీళ్ళవృత్తి ఏమిటయ్యా? అని అడుగుతారేమో! వీరూ కార్యకరా దులకు వెళుతూ వుంటారు. సభలలో సిద్ధ మవుతారు. పురోహితులు మంత్రాలు ఏకరుపెట్టి అగినప్పుడల్లా వీళ్ళు 'తథాస్తు! తథాస్తు!!' అంటూవుంటారు. వీరికి చేత నయింది ఈ ఒక్క ముక్కే. ఇలా 'తథాస్తు' అన్నందుకుగాను మహా ఐతే కడుపునిండా భోజనమూ, అర్థణాకు మించని సంభావనా దొరుకుతూ వుంటుంది. వీళ్ళను 'తథాస్తు బ్రాహ్మ'లంటారు. వీళ్ళు ఒకొక్క నాడు ఐదు, ఆరు కార్యాలకువెళ్ళి అర్థణా చొప్పున సంపాదిస్తారు. అనగా రోజుకి మొత్తం ఏమూడణాలో దొరుకుందన్నమాట.

తథాస్తుబ్రాహ్మల ముఠాలో చేరినవాడు సుబ్బావధానులు. నలభైయ్యేళ్ళు నెత్తి మీదికి వచ్చినా ఆయన ఆదాయంలో ఎదుగు బొదుగులు లేకపోయేసరికి, భార్య లచ్చమ్మ ఉండబట్ట లేకపోయింది. 'యేవండీ, తోడివాళ్ళంతా రోజూ పదీ పది హేనూ రొండిని పెట్టుకు వస్తున్నారాయెనే, మీరేమిటి తథాస్తు తథాస్తు అనుకుంటూ, ఎన్నాళ్ళిలా కాలక్షేపం? ఎన్నాళ్ళు ఎన్ని తథాస్తులు చెప్పి ఎన్ని అర్థణాలు పోగేసుకువస్తే మనకు

ఏ. జె. పట్నాయక్ - సాలూరు

కడుపు నిండుతుంది?' అంటూ చెప్పుకొని యేడిచింది.

ఎంత చేతకానివాడైనా అవధాన్లకు పౌరుషం వచ్చింది. వెంటనే బయల్దేరి దూర దేశం వెళ్ళాడు. ఘట్టి పండితులను ఆశ్రయించాడు. అన్నికార్యాలూ చేయించటానికి తగిన మంత్రాలు క్షుణ్ణంగా నేర్చుకొని, తిరుగా దేశంవచ్చేశాడు.

సుబ్బావధాన్లు గొప్పవిద్వాంసుడనీ, పెద్ద సిద్ధాంతుల జాబితాలో చేరిపోయాడనీ పేరు పడింది. పెద్దపెద్ద పౌరోహిత్యాలకుకూడా ఇప్పుడు అవధాన్లకు పిలుపులు రాసాగినై. ఇది చూచి అనాదిగా వుంటున్న పురోహితులందరకూ కన్నెర్రనయింది. 'అబ్బా! ఎంతవాడవయాపోయి అవధాన్లూ' అని వాళ్ళు అసూయచెందుతూవచ్చారు.

ఒకసారి ఒక గొప్పవారియింట్లో పెళ్ళి చేయిస్తున్నాడు సుబ్బావధాన్లు. మంత్రం చెప్పి సమస్తదేవతలనూ ఆహ్వానించాడు. మంత్రం పూర్తి కాగానే పూర్వపు అలవాటు చొప్పున ఒక్కసారి 'తథాస్తు!' అనేశాడు. పురోహితులందరూ ఎప్పుడు అదును వస్తుందా, ఎప్పుడు వీడికి ఉద్వాసన చెప్పిద్దామా అని కనిపెట్టుకొని వున్నారాయె. ఇప్పుడు వాళ్ళు అవధానులను దుయ్యబట్టారు! 'వీడికేమీ చేతకాదండి తథాస్తు అనటం తప్ప. అన్నీ అపశ్రుతులు పలుకుతున్నాడు' అంటూ యజమానుడితో చెప్పి, ఆయనను అపతలకు సాగనంపించారు.

అవధానులు ఇంటికి వెళ్ళగానే లచ్చమ్మకు ఈ సంగతి తెలిసి, 'ఎన్నాళ్ళు చదివితే యేంలాభం? కుక్కతోకకు వంక తీయగల వాళ్లెవళ్ళు? వెళ్ళండి, మళ్ళా చెంబూ మీరూ తయారై, 'తథాస్తు'అంటూ కూర్చోండి' అని విసుక్కొంటూ, మనసులో ఆవేదన వెల్లడించింది.

నాటినించి సుబ్బావధానులు మళ్ళీ తథాస్తు బ్రాహ్మడుగానే వుండిపోయాడు.





# యేబ్రాసికి పనెక్కువ

నేపాళదేశంలో పూర్వం షెర్‌షీర్‌జంగు రాణా అనే గొప్ప జమీందారు ఉండేవాడు. అయన భూములలోంచి ఒక నది ప్రవహిస్తూండేది. ఆ నదిలో అనేక స్ఫటికపు లింగాలు కొట్టుకొచ్చేవి. నున్నగా అందంగా వున్న లింగాలన్నీ ఆయన యేరించి జాగ్రత్తపెట్టేవాడు.

శివభక్తులకు ఈ లింగాలంటే మహా ప్రీతి. ఎక్కడెక్కడున్న శివభక్తులూ ఆయన వద్దకువెళ్లి ఆశ్రయించి ఒకొక్క లింగం పట్టుకుపోయి దేవతార్చనపెట్టెలో పెట్టి పూజచేసుకుంటూ వుండేవారు. ఆయన జాగ్రత్తపెట్టిన మంచి లింగాలన్నీ యీ విధంగా ఖర్చయిపోయి, అఖరికి ఒకే ఒక్క లింగం మిగిలింది.

ఒకనాడు బసవేశ్వరుడనే గొప్ప శివభక్తుడొకడు దక్షిణదేశంనుంచి రాణాయింటికి వేంచేసి, అయన చేసిన అతిథి సత్కారాలు స్వీకరించి, మెల్లిగా తాను వచ్చిన పని చెప్పేడు. వేరే పనేముంది? లింగంకోసమే వచ్చాడాయనాను. రాణా తన వద్దనున్న ఆ ఒక్క లింగమూ బసవేశ్వరుడికి భక్తిపూర్వకంగా ఇచ్చేశాడు.

ఒక్కటే మిగిలిందనిచెప్పి ఇవ్వటం మానెయ్యకుండా, రాణా దాన్ని తనకు ఇచ్చివేసినందుకు బసవేశ్వరుడు చాలా సంతోషించాడు. ఆయన వెళ్లిపోతూ తన జోలెలోనించి ఒక ఇత్తడిపెట్టెను తీసి రాణా చేతులోపెట్టి, "షెర్‌షీర్‌జంగ్! ఈపెట్టెలో ఒక భూతం వుంది. నీకేం పనికావలసివచ్చినా అది చేసిపెడుతుంది. కావలసినప్పుడల్లా, పెట్టెలోంచి భూతాన్ని పైకి రప్పించి, పనులు చేయించుకో" అని చెప్పి వెళ్లిపోయాడు.

ఆపెట్టె మహిమను చూడాలనిచెప్పి, రాణా మర్నాడే దాన్ని బల్లమీద పెట్టి,

పాలంకి వెంకటరామచంద్రమూర్తి, మదరాసు

"భూతం! నాకు స్నానానికి వేడినీళ్లు సిద్ధం చెయ్యి" అన్నాడు. వెంటనే పెట్టె తెరుచుకుని ఆరంగుళాల పొట్టివాడొకడు బైటకు వచ్చాడు. వచ్చి, చూస్తోండగానే జరడుగుల పొడుగున ఎదిగి గబగబా నీళ్ల గదిలోకి వెళ్లి నిప్పుచేసి నీళ్లుకాచి సిద్ధంచేశాడు. అంతా ఒక్క క్షణంలో జరిగిపోయింది.

రాణాకు ఈపద్ధతి బాగానేవుందనిపించి, ఆయన ప్రతిపనీ ఆ భూతంచేతనే చేయించుకోవటం మొదలెట్టేడు. ఇంటిపని, వంటపని, బజారుపని, చాకలిపని, మంగలిపని— ఇదేమిటి, అదేమిటి సమస్తమైన చాకిరీలూ ఆ భూతమే చేసేస్తూండడంవల్ల, అంతవరకూ ఆపనులు చేసే నౌకర్లందరికీ ఒక్కమాటుగా పని లేకుండాపోయింది.

"మీరు మరోచోట ఎక్కడైనా కుదురుకోండి" అని ఆయన వాళ్ళతో చెప్పేసేసరికి, వాళ్ళంతా ఆయనపాదాలమీద పడి, "ప్రభూ, మమ్మల్ని పంపెయ్యకండి. ఇదివరకుకంటే ఇంకముందు ఎంతో భయభక్తులతో పనులుచేస్తాం. మాకు శక్యంగాని పను లేమైనా కావలసినప్పుడే ఈ భూతంచేత చేయించుకుందురుగాని" అని ప్రాధేయపడ్డారు.



ఆయన వాళ్ళమీద జాలిపడ్డాడు. 'అయ్యో, ఇంతమంది పనిలేకుండాపోతారే' అని భూతమున్న పెట్టెను అటకమీద పెట్టేసి, పాతనౌకర్లచేతనే తన పనులన్నీ చేయించుకుంటూవచ్చాడు.

ఈ నౌకర్లందరిలోకీ బద్ధకస్థుడు రహిమాన్ అనే తోటవాడు. యజమాని యేంపనిచెప్పినా వాడుచెయ్యక తక్కిన వాళ్ళచేత చేయిస్తోండేవాడు. ఎవళ్ళపని వాళ్ళకే వున్నప్పుడు వీడిపనికూడా చేసిపెట్టడానికి తక్కినవాళ్ళకి అస్తమానం తీరికవుంటుందా? చేసిపెట్టాలని యిష్టం వుంటుందా?



యజమాని ఒకనాడు పెరట్లో యేదో ఒక మొక్క నాటించటానికని ఒక గొయ్యి తియ్యమని రహిమానుకు పురమాయించి ఎక్కడికో వెళ్ళేడు. మామూలుప్రకారం రహిమాను ఆపనిని తక్కినవాళ్ళకు పురమాయించబోయాడు. ఐతే, ఈసారి వాళ్లు వాడిమాటలను లక్ష్యపెట్టక "నువ్వా మాలాగానే జీతంపుచ్చుకుంటున్నావు. నీపని నువ్వేచేసుకో. మాకేంపట్టింది? ఫో, పొ"మ్మన్నారు.

సోమరిపోతులు యెన్ని ఆలోచనలకైనా పోతారుగాని, పనిమాత్రం ముట్టుకోరుగదా. పరమ బద్ధకస్థుడైన రహిమాను 'ఆపని ఎవరిచేత చేయించడమా?' అని తెగ ఆలోచిస్తున్నాడేకాని, తను చేయటానికిమాత్రం పూనుకోలేదు.

కొంతసేపటికి వాడికి మెరపులాంటి ఆలోచన ఒకటి తట్టింది. తట్టడమేతడవుగా వాడు గబగబ ఇంటిలోపలికి పోయి, అటకయెక్కి భూతమున్న పెట్టెకు ఎదురుగా నిలబడి, షెర్‌షీర్‌జంగురాణా గొంతుకతో, "భూతం! పెరట్లో ఒకగొయ్యి తవ్వు" అని అజ్ఞాపించాడు.

వెంటనే అరంగుళాల భూతం బయట కొచ్చి, అరడుగులయెత్తునా పెరిగి రహిమానుని చూసింది. "అరే, బద్మాష్. నువ్వా, నన్నుపిలుస్త! యజమాని అనుకున్నాను" అని కోపంతో పళ్ళు పటపట కొరికింది. ఐతేం? ఇవతలకు వచ్చాక అజ్ఞ నెరవేర్చటం తప్పదుగనుక గునపంపుచ్చుకుని పెరట్లోకివెళ్ళింది.

భూతం పళ్ళుకొరికి కోపంచూపినందుకు రహిమాను మొదట భయపడ్డాడుకాని, పని జరిగిపోతూన్నందుకు సంతోషించి తన తెలివికి తనే మెచ్చుకున్నాడు. సుష్టుగా భోజనంచేసి వుండటంచేత వాడికి అక్కడనే చల్లగా కునుకురాబోయింది. ఎదురుగా

యజమానిరత్నకంబళీ కనపడితే దానిమీద ఒక్కసారి నడుంవాల్చాడు.

పొగరు గాకపోతే యజమాని రత్నకంబళీ మీద వాడికి పడకేమిటి? 'ఆయన చూడ వచ్చాడా? ఆయన వచ్చేలోగా లేచి పోలేమా!' అన్నధైర్యంతో వాడు అలా పడుకున్నాడు. పడుకోడమే తడవుగా నిద్ర పట్టేసింది. సోమరిపోతులకి నిద్ర ఎక్కువంటారు. అందుకని అంతలోనే గుఱ్ఱు కూడా పట్టేడు. రెండుగంటలలా వాడు నిద్రపోయేసరికి, అదారిని వెడుతూన్న వంటవాడు చూసి, వాడిధైర్యానికి ముక్కుమీద వేలేసుకున్నాడు. యజమాని చూస్తే వాడినౌకరీ పోతుందన్న జాలికొద్దీ, చేతిలో వున్న వేడిగరిటెను రహిమానునడ్డిమీద పెట్టి చుఱ్ఱుమనిపించాడు.

రహిమాను ఉలిక్కిపడి లేచి గొయ్యి యెంతవరకూవచ్చిందో చూద్దామని పెరట్లోకి పరుగెత్తేడు. పరుగెత్తుతే యేముంది? బ్రహ్మండమైన గొయ్యి ఒకటి తయారై, దాని అడుగున ఇంకా తవ్వుతోనే వున్న అభూతం కనపడింది. 'ఒక్క అడుగులోతు గొయ్యి తీయమంటే సముద్రమంతగొయ్యి తీశావేమిటి? రాణాగారి




మేడ పునాదులకిగూడా దెబ్బతగిలేటట్లుందే. మేడ కూలి గోతిలో పడిపోతుందో యేమో! ఆగు! ఇంక తవ్వకు!' అని అరిచాడు.

భూతం మండిపడుతో, 'త్రవ్వమనటానికీ ఆగమనటానికీ నీ యిష్టమేనా? యజమానివచ్చి అగమనేదాకా, నువ్వు గాదు, బ్రహ్మరుద్రులొచ్చినా ఆగేదిలేదు' అని ఉరిమాడు.

ఆ అరుపు విని, ఇంట్లోవున్న నౌకర్లంతా వచ్చారు. సంగతంతా విన్నారు, సగర పుత్రులు తవ్విన మహాగుండంలాగ కనబడే ఆ గోతిని చూసి గుండె బాదుకున్నారు. 'ఒక్క క్షణం ఆలస్యంచేసినా భవనం

అంతా ఆ గుండంలో కూలిపోతుంది! పరుగెత్తు! యజమానుణ్ణి త్వరగా తీసుకురా'అని వాళ్లు రహిమానుని తరిమేరు.

అప్పుడే యింటికి తిరిగివస్తూన్నాడు రాణా. గుండెలు కముక్కుంటూ పరుగెత్తుకొస్తూన్న రహిమాను ఆయనకు ఎదురయ్యేసరికి, "ఏమిట్రా కంగారు?" అని అడిగేడు. అందుకు రహిమాను "మీ కొంప కూలిపోతోందండీ స్వామీ! త్వరగా రండి!" అంటూ వెనక్కి పరుగెత్తేడు. రాణాకూడా చరచరా అడుగులువేసి ఇంటికి చేరుకుని పాతాళంవరకూ త్రవ్వివున్న ఆ గొయ్యిచూసి ఆశ్చర్యపోయాడు. ఇంకా త్రవ్వి, మట్టిని గుట్టగా పోస్తున్న భూతాన్ని, పైకిరమ్మని, "భవనం కూలిపోకుండా మూడు గజాలదూరంగా జరిపి నిలబెట్టు" అని ఆజ్ఞాపించాడు.

భూతం ఆ ఆజ్ఞ నెరవేర్చి గోతిప్రక్కన ఏడుపుమొహం పెట్టుకు నిలబడ్డ రహిమాన్ కేసి కొరకొరా ఒకచూపు చూసి, పెట్టెలో ప్రవేశించి తలుపు మూసుకున్నది.

నౌకర్లవల్ల రాణా సంగతిఅంతా విన్నాడు. రహిమాన్‌నుపిలిచి "చూస్తావేం ఇంకా, పార తీసుకొని గొయ్యి పూడ్చటం ప్రారంభించక?" అని హుంకరించాడు.

రహిమాను గజగజ వణుకుతో, "అయ్యో బాబోయ్, ఈ గొయ్యి పూడ్చటం నాతరమవుతుందా? ఎన్నేళ్లు పడుతుందో!" అని గోలపెట్టేడు.

"పట్టనియ్యి. కాస్త పనికి బద్ధకించావు గనుక నీకింతే శాస్తి. యేబ్రాసికి పని ఎక్కువంటారుపెద్దలు. తీసుకో పార" అన్నాడు రాణా.

కిక్కురుమనకుండా రహిమాను పార పుచ్చుకుని, పెద్ద పర్వతంలాగా పడివున్న మట్టినితీసిగొయ్యిపూడ్చడంప్రారంభించాడు. వాడు అలాగ ఎంతకాలం పూడ్చినప్పటికీ ఆ గొయ్యి పూడటం కనబడలేదు.



# చందమామ పజిల్
## (భాషాభివృద్ధికి)

అడ్డము :

1. శివుడు
3. ఇల్లు
6. జుట్టుముడి
8. స్వారస్యము
9. సరస్వతి
11. రాత్రి
12. దుర్యోధనుడి మేనమామ
13. ఐశ్వర్యము
15. ప్రోగు
17. ఒక వాద్యము
19. కలవరము
20. వ్రేలు




నిలువు :

1. కోపము
2. వైరము
4. భూమి
5. మోకము
7. ఒక కొలత
9. గోరువంక
10. ఒక తిథి
14. వ్రాత
15. చందమామ
16. రాయి
17. మంచి
18. దుర్గ

# వినోద చదరం



దిగువను ఇచ్చిన ఆధారముల సహాయంతో ఈ క్రింది చదరంలో మీరు ఏడు మాటలు నింపాలి. సరియైన మాటలతో మీరు నింపగలిగితే అన్ని మాటలలోను చివరి రెండు అక్షరాలూ ఒకేలాంటివి వస్తయ్. దీనిని పూర్తి చేయగలరేమో చూడండి.

మీకు తెలియకపోతే జవాబుకి

55-వ పేజీ చూడండి.

| | | | |
|---|---|---|---|
| 1. | | | |
| 2. | | | |
| 3. | | | |
| 4. | | | |
| 5. | | | |
| 6. | | | |
| 7. | | | |

ఆధారములు :

1. గౌరవము
2. భారము
3. భయస్తురాలు
4. కాటకము
5. కొలను
6. అప్పు
7. కొండ




## భూమిలో మొక్క మొలిపించటం

చిన్న మామిడిమొక్కను లేదా కొమ్మను భూమిలో పాతిపెట్టి, అయిదు నిమిషాల్లో దాన్ని కాయలున్న మామిడిమొక్కగా తయారుచేసే ఇంద్రజాలంచూసి చూపరు లంతా తెల్లబోతారు. మనదేశపు గారడీ వాళ్లు ఈ గారడీని ఎంతో చక్కగాచేసి చూపుతారు. ఈ ప్రదర్శనంలో చూపే నేర్పూ, చాకచక్యమూ వాళ్లకు వంశపారంపర్యంగా వచ్చేదేకాని, వేరుకాదు. అంతటి నేర్పు హస్తలాఘవం నేర్చినవాళ్లుకూడా అమోఘ్తరుగా చూపలేరు. పైగా ఈవిద్యను వాళ్లు బస్తీలలో-పల్లెలలో ఏ వీధిప్రక్కనైనా సరే ప్రదర్శించగలరు. పాశ్చాత్యదేశాల్లోని ఇంద్రజాలికులకు ఇది యెంతో వింతగా కన్పిస్తుంది. వాళ్లు ఇంతకన్న కష్టమైన గారడీలను ఎన్ని అయినా సులభంగా ప్రదర్శించగలరు కాని, దీనిని మాత్రం మనదేశీయులు చేసేటంత సుళువుగా ప్రదర్శించలేరు.

రేకుతో చేయబడిన ఒక గుండ్రటి డబ్బా, (సుమారు ఒక అడుగు ఎత్తూ, అరడుగూ వెడల్పూ వున్నది) తీసుకో. దీనికి మూత వుండకూడదు. వెడల్పు మూతిగల థర్మో



ఫ్లాస్కులకు వుండే పెద్దసైజు బిరడా తెచ్చి, దానిమధ్య సన్నని బెజ్జంచెయ్యి. ఈ బెజ్జం గుండా నీవు చూపబోయే మొక్కకుండే కాడని దూర్చు. (కాడ చాలినంత పొడుగు

వుండాలి). బిరడాతోసహా మొక్కని డబ్బాలో పెట్టి, మూతికి ఒక జేబురుమాలు కట్టు.

ఈ ట్రిక్కు నీవు ఎక్కడ ప్రదర్శించ దలుచుకున్నావో అక్కడ, భూమిలో సరీగా డబ్బా పట్టేపాటి గొయ్యి త్రవ్వు. అయితే, డబ్బా ఎత్తుకంటె మరో జానెడు ఎక్కువ లోతుగా గొయ్యితియ్యాలి. ఈ గోతిలో నీవు తయారుచేసి తెచ్చుకున్న డబ్బాపెట్టి డబ్బా పైన ఖాళీగా వున్నంతవరకూ, యిసుకతో నింపు. ఆపైన మామూలు మట్టితో పూర్తిగా



కప్పి వేసి నేలను చదునుగా చేసివెయ్యి. ఇది ఎలావుండాలో మొదటిబొమ్మలో చూడు.

ప్రదర్శనం చేయబోయేముందు, ప్రేక్షకులఎదట నిలబడి, నీవు డబ్బాని కప్పి పెట్టిన చోటుని వ్రేలితో చూపుతూ, 'చూడండి. మీరు చూస్తూవుండగానే, ఒక మొక్క మొలిపిస్తాను' అంటూ, ఆ ప్రదేశంలో నీళ్లుపొయ్యి. నీళ్ళు యిసుకలోంచి లోపలికిపోయి, డబ్బాకి కట్టివున్న జేబురుమాలులోంచి డబ్బాలోకిపోతై. ఆ నీటిపైన బిరడాతోసహా కొమ్మ కొంచెం పైకి తేలుతుంది.

తర్వాత, యిసుకని పెల్లగించి ప్రక్కనే కుప్పగా పోస్తూవుండు. కొంతసేపటికి ఇసుక అంతా అయిపోయి, డబ్బాకి కట్టిన జేబురుమాలు నీచేతికి తగులుతుంది. దానిని జాగ్రత్తగావిప్పి, ఆ గోతిలోపలనే డబ్బా ప్రక్కన దూర్చు. మళ్ళీ నీళ్ళు కొంచెం కొంచెంగా పోస్తూవుండు. నీళ్ళు పోసినకొద్దీ బిరడా పైకి తేలుతుంది. బిరడాతోపాటు దానికి గుచ్చివున్న మొక్క తేలుతుంది. చూచేవాళ్లకి, ఆ మొక్క అప్పటికప్పుడు పుట్టి కొంచెం కొంచెంగా భూమిలోంచి పైకి వస్తున్నటు కనుపిస్తుంది. రెండోబొమ్మ చూస్తే ఇది మరింత వివరంగా తెలుస్తుంది.

---

పాఠకులు ఈ గారడిని గురించి యింకా వివరంగా తెలుసుకోదలిచితే, వారు 'చందమామ' పేరు ఉదహరిస్తూ ప్రొఫెసరుగారికి నేరుగా వ్రాయవచ్చు. మీరురాసే ఉత్తరాలు ఇంగ్లీషులోనే వుండాలి. ఇది అతి ముఖ్యం.

ప్రొఫెసరుగారి అడ్రసు యిది :—

ప్రొఫెసరు పి. సి. సర్కార్, మెజీషియన్
12/3/A, జమీర్‌లేన్, బాలీగంజ్,
కలకత్తా - 19

# అట్టమీది బొమ్మ

రాజసూయయాగం ప్రారంభంకాబోతున్నది. ధర్మరాజు సదస్యుల అభిప్రాయం తెలుసుకొన్నాడు. వారి యిష్టప్రకారం మొట్టమొదట గోవిందుని పూజించాలెనని సంకల్పించి, ఆ మహాత్ముని సన్నిధికి వెళ్ళి పాదాలు కడిగాడు. పవిత్రమైన ఆ పాదోదకాన్ని తనూ, తమ్ములూ, కుటుంబమూ, పరివారమూ అందరూ శిరసున చల్లుకొన్నారు.

ధర్మరాజే ఇలా శ్రీ కృష్ణునికి పట్టువస్త్రాలూ దివ్యభూషణాలూ అర్పించి పూజించి ఆనందబాష్పాలు రాల్చేటప్పటికి, మహోత్సవం చూడవచ్చిన రాజులందరూ కృష్ణునికి భక్తితో ప్రణమిల్లి, జయజయశబ్దాలు చేశారు. పుష్పవర్షం కురిసింది.

ఇంతవేడుకగా శ్రీకృష్ణుడు తొలిపూజలు అందుకోవటాన్ని శిశుపాలుడు సహించలేక పోయాడు. కూర్చున్నవాడు కుపితుడై దిగ్గునలేచి, వాసుదేవుని నిందిస్తూ నోటికిరాని కారుకూతలు కూశాడు. కాని, కేశవుడు కిమ్మనలేదు. అటుతరువాత శిశుపాలుడు సదస్యులవంక తిరిగి 'తపోధనులు, బ్రహ్మనిష్ఠులు ఐన ఋషివర్యులుండగా, ఎట్టి అర్హతలేని కుర్రవాడు ఈ గోపాలుణ్ని పూజిస్తూన్నారేమిటి?' అంటూ ఇష్టంవచ్చినట్టల్లా దుర్భాషలాడ నారంభించాడు.

హరినింద వినలేక సభాసదులు చెవులుమూసుకొని శిశుపాలుని తిడుతూ లేచి పోయారు. పాండుసుతులూ, మరికొందరు రాజులూ వానిని పరిమార్చటానికని తలపడ్డారు. అయితే, శిశుపాలుడు చలించలేదు. అందరినీ అదలిస్తూ తత్తరపడక అలానే నిలిచివున్నాడు.

అంతలోనే కృష్ణుడు ప్రయోగించిన సుదర్శనచక్రం తిన్నగా వెళ్ళి శిశుపాలుని తలనూ మొండెమునూ వేరుచేసింది. అప్పుడు శిశుపాలునిలోనుండి ఒక దివ్య తేజస్సు వెలువడి, మెరుస్తూపోయి కృష్ణభగవానునిలో ఐక్యమైపోయింది.

# రంగుల బొమ్మ కథ—1-వ బొమ్మ

చీనాదేశంలో ఒక వూర ఒక పేదరాలుండేది. ఆమె ఆ వూరి బజారులో ఒక కొట్టు అద్దెకు తీసికొని, అందులో గొడుగుల పర్తకం పెట్టింది. అమె దుకాణంలో రకరకాల గొడుగులు ఉండేవి.

ఆమెకు ఒక్కగానొక్క కొడుకు చాంగ్. అతడికి దుకాణంలో కూర్చోవటం అంటే తలనొప్పి. అందుకని ఎంతసేపూ గదిలో ఏకాంతంగా కూర్చుని ఏదో ఆలోచిస్తూ ఉండేవాడు. ఐతే అవన్నీ వ్యర్థపు ఆలోచనలు మాత్రం కావు. తసతల్లి చేస్తున్న గొడుగుల వ్యాపారానికి అనుకూలంగా వుండే పనులు చేద్దామనే ఎంత సేపూ అతని ఆలోచన.

చాంగ్ దృష్టి కళాదృష్టి. మట్టితో చక్కటి బొమ్మలుచేయటం, కర్రతోనూ వెదురుతోనూ చిత్రమైన విగ్రహాలు చెక్కటం అతనికి సరదా. అతడు ఆ గదిలో కూర్చుని గొడుగులకు పనికివచ్చే ఆకర్షణీయమైన కర్రపిడులు తయారుచేసే వాడు. అతడు తయారుచేసిన పిడులతో అమర్చిన గొడుగులను కొనవచ్చినవాళ్లు ఎగరేసుకు పోయేవాళ్లు.

అతడు పొలాలలోకి అడవులలోకి షికారువెళ్లేవాడు. అక్కడికి వెళ్లినా చాంగ్‌కు ఇదే దృష్టి. 'గొడుగుల పిడులుచెయ్యటానికి పనికివచ్చే మంచి కర్రలు ఏవైనా దొరుకుతాయా?' అని వాని మనసు ఆలోచించేది.

ఒకప్పుడు ఇలాగే అతడు ఒక అడవిలోకి వెళ్లేసరికి చిత్రమైన చెట్టు ఒకటి కనిపించింది. అయితే అచెట్టు సామాన్యపు చెట్టుకాదనీ, అది ఒక మాయచెట్టు అనీ అతనికి తెలియదు. అచెట్టువైపు తేరిపారచూచాడు చాంగ్. 'ఈ కొమ్మలు భేషుగ్గా వున్నై. వీటితోఒక వృద్ధుడిబొమ్మ చేయటానికి ఎంతైనా అనుకూలంగా వుంటుంది' అనుకొని సంతోషించి, కత్తితో ఒకకొమ్మ నరకబోయాడు. అతర్వాత ఏమిజరిగిందీ వచ్చేనెల బొమ్మతోసహా చదవండి.

# తప్పనిసరి

స్మిత్ దొరగారు వేసంగిలో ఒకప్పుడు ఊనూరు వెళ్లారు. ఆయనకు గుమాస్తాలతో కలివిడిగా వుండటం, వాదోపవాదాలు చేయుటం మామూలు. ఐనా, హిందూ దేశపు గొప్పదనాన్నిమట్టుకు ఒప్పుకోవడమంటే ఆయనకు మనస్కరించేది కాదు.

ఒకరోజున తాజ్ మహలును గురించి చర్చవచ్చింది. 'ప్రపంచపు వింతలలో ఇది ఒకటి' అని గుమాస్తా పొగడసాగాడు. అంతావిని స్మిత్తు 'ఐతే కావచ్చు కాని, ఆ గొప్పమాత్రం భారతీయులకు చెందదు. ఏమీ అంటే దానిని నిర్మించిన శిల్పి ఇటలీ దేశస్థుడు' అన్నాడు, గర్వంగా. 'శిల్పి ఏదేశస్థుడైతేనేం, పని చేసినవాళ్లు భారతీయులేకదా!' అన్నాడు గుమాస్తా.

'అదేమిటయ్యా? ఒక గ్రంథకర్త నవల వ్రాస్తాడు. దానిని 'బైండు' కొట్టినవాడికి అధికృత యేమిటి? అంతా కల్పనలోనే వున్నది ప్రతిభ' అని వాదించాడు దొర.

అప్పుడు గుమాస్తా 'పోనీ అలాగే. అసలీ నిర్మాణం ఎవరినిమిత్తమై జరిగిందో ఆ కారకురాలు భారతీయ వనితకదా?' అని ప్రశ్నించాడు గుమాస్తా. 'కాదు, ఆమె పర్షియాదేశపుస్త్రీ 'అన్నాడుస్మిత్తుదొర.

దొరగారి పట్టుదల చూచి గుమాస్తా 'అయ్యా, భవనంయొక్క నిర్మాణానికి వినియోగించిన సామగ్రి ఐనా భారత దేశానికి చెందినదేనంటారా' అన్నాడు. అందుకూ ఒప్పుకోలేదు దొరగారు. 'ఆ చలువరాతి పలకలు పర్షియానించీ ఇటలీ నించీ వచ్చా' యన్నాడు. ఉండబట్టలేక గుమాస్తా 'పోనీ, కట్టడానికైన ద్రవ్యమైనా భారతీయుల దేనా?' అని అడిగాడు. 'కాదు,కాదు. అది పర్షియానుంచి తైమూర్ కొల్లగొట్టి తెచ్చిన ధనంలో భాగం'అన్నాడు దొరగారు, బెట్టుగా. ఇక విసుగువచ్చి గుమాస్తా 'పోనీయండి, భవనమైనా భారత దేశంలో వున్నదని ఒప్పుకొంటారా?' అన్నాడు, నిస్పృహతో. 'అవునయ్యా బాబూ, అవును. అదే వచ్చిందిముప్పు....' అంటూ తప్పనిసరిగా అంగీకరిస్తూవిచారం తెలిపాడు స్మిత్తుదొర.

'తాతలు దిగివచ్చారయ్యాదేవా నిన్ను నొప్పించేందుకు. ఆ భవనం తాలూకు బహు కొద్దే మా భారతీయులదైనా, ప్రపంచమంతా ఈ వింత చూడటానికి మా దేశానికి రావలిసిందే' అన్నాడు నవ్వుతూ గుమాస్తా.

49-వ పేజీలోని

పజిలుకి జవాబు :

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 క | 2 ప | ర్ది | | 3 సౌ | 4 ధ | 5 ము |
| 6 ని | గ | | 7 మూ | | 8 ర | క్తి |
| | | 9 శా | ర | 10 ద | | |
| 11 శా | ర్వ | రి | | 12 శ | కు | ని |
| | | 13 క | 14 లి | మి | | |
| 15 రా | 16 శి | | వి | | 17 బా | 18 కా |
| 19 క | ల | త | | 20 అం | గు | ళి |

49-వ పేజీలోని

వినోద చదరానికి జవాబు :

| | | | |
|---|---|---|---|
| 1. | ప | రు | వు |
| 2. | బ | రు | వు |
| 3. | భీ | రు | వు |
| 4. | క | రు | వు |
| 5. | చె | రు | వు |
| 6. | అ | రు | వు |
| 7. | మే | రు | వు |

# చందమామ

## నూతనసంవత్సర శుభవార్త



1 జనవరి, 1952 నుండి చందమామ కార్యాలయం తన స్వంతభవనంలో పని చేస్తుంది. ఇకముందు సంచికలన్నీ అక్కడ నుండే వెలువడుతై. పాఠకులు, రచయితలు, ఏజంట్లు యింతవరకూ చూపిన అభిమానానికి చందమామ తన కృతజ్ఞత తెలుపుతూ, ముమ్ముందుకూడా వారు అదేవిధమైన అభిమానాన్ని చూపుతారని ఆశిస్తోంది.

పాఠకులూ, రచయితలూ, ఏజంట్లూ చందమామ చిరునామా మార్పును గమనించి, తాము పంపే రచనలూ, ఉత్తర ప్రత్యుత్తరాలూ, మనియార్డర్లూ మొదలైనవన్నీ, దిగువ యిచ్చిన నూతన విలాసానికి పంపమని ప్రార్థన.

నూతన విలాసము :

CHANDAMAMA PUBLICATIONS
2 & 3 ARCOT ROAD
KODAMBAKKAM :: MADRAS-24

CHANDAMAMA (TELUGU) JANUARY '52 REGD. No. M. 4854




రంగులబొమ్మ కథ — 1-వ బొమ్మ